# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120000464

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గురుభక్తి

( శ్రీగోస్వామి తులసీదాస చరిత్రోత్తరఖండము )




దంటు శ్రీనివాసశర్మ,
బి.ఏ., బి.యల్.

## — తప్పొప్పుల పట్టిక —

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 10 | సంతస్థముల | సంతస్థముల |
| 8 | 8 | హాటకగర్భరాణి | హాటకగర్భునిరాణి |
| 59 | 10 | సహింపుచు | సహించుచు |
| 103 | 3 | ఈజ్వాల | ఉజ్జ్వాల |
| 104 | 19 | గందునవిందు | విందునుగందు |
| 142 | 5 | సిద్ధింగను | సిద్ధింగనెం |
| ,, | 6 | టారయ | దద్దయు |

# పీఠిక



లోకమునందు కొందరు విద్వత్కవులు. కొందరు కవులు. ఈ విద్వత్కవు లన్నమాట, ఆ కవి, విద్వాంసుడుకూడ నైయుండినప్పుడు వాడబడుచున్నది. ఆ విద్వత్త ఆకవికావ్యము నందు కనిపించునా, లేదా, యని విచారణ వచ్చినచో, ఆ శబ్దము నేడు ప్రయోగింపబడుచున్న తరహాలో, కనిపించ నక్కరలేదు. విద్వాంసుడు కనుక ప్రయోగించిన శబ్దములు, సుష్ఠువులుగ నుండవచ్చును. విద్వత్త తావన్మాత్రమే. ఈవిద్వత్కవి శబ్ద మింతమాత్రమే కాక. శాస్త్రజ్ఞానము, శాస్త్రముల యందలి రహస్యములు నెలకొల్పబడుట, మొదలైనవి జరిగినచో ఆ కవి కవిత్వమునకు విద్వత్కవిత్వము అనినగాని, ఆ కవిని విద్వత్కవి యనినగాని యెక్కువ యౌచిత్యముండును. ఇట్లు చూచినచో నందరును విద్వత్కవులుకారు. రామరాజభూషణుడు విద్వత్కవి. పెద్దన్నగారు కవి. మహాకవి కావచ్చును. కావ్యవస్తువు ఒక్కలోకమే కాదుకదా! సర్వశాస్త్రముల యందలి విషయము లన్నియు కావ్యవస్తువులే.

ఈ పద్ధతిగాఁ జూచినచో ఈ 'గురుభక్తి' కావ్యము, విద్వత్కవిత్వము. ఈ కవి విద్వత్కవి. ఈయన షట్ఛాస్త్రములు నేర్చినవాడు. తర్కములో నెంతవరకు చదివెను? వ్యాకరణములో, కౌముదియైన పూర్తిచేసెనా? మొదలైన ప్రశ్నలు, గ్రంథబుద్ధ్యా పుట్టవు. గ్రంథమునందు పాండిత్య మెంతవరకు

కనుపించుచున్నది అన్న ప్రశ్న పుట్టినదో, గ్రంథమున, మంత్రశాస్త్రప్రసక్తి, వ్యాకరణశాస్త్రములోని కొన్ని విషయములు చక్కగా నిక్షేపింపబడుట—ఇది విద్వత్కవిత్వము అనిపించుకొనుటకు తగిన ట్లున్నది.

కొందరు కవిత్వమునకు పాండిత్యమునకు సంబంధమే లేదందురు. కవిత్వ మనునది యందరకు నర్థము కావలయునని యందురు. అనగా అందర కర్థమగు సామాన్య విషయములే కావ్యమునం దుండవలయుననికదా! ఇచ్చట 'నందరకు' అనగా గూడ, నెక్కువ మందికి అని మాత్రమేకదా యర్థము. ఆ యెక్కువమందికూడ పఠనశీలురలో ననికదా! ఇట్టిమాటల కర్థ మిదియని నిర్ణయింపరాదు. ఇట్లనువారి తాత్పర్యము శాస్త్రగతవిషయములను కవి పరిహరింపవలయునని. కవి అట్లే పరిహరించును. వట్టి లౌకిక విషయములనే గ్రహించును. అప్పు డందరకు తెలియునని చెప్పవచ్చునా? ఈ కావ్యమున తులసీదాసు తనకు గురువు కావలయునని, హనుమంతుడు కాశిలో పురాణము చెప్పు నొకచోట వృద్ధభూసురుడుగా నుండునని, తెలిసికొని ఆ వృద్ధభూసురుని పట్టుకొని యతని నాశ్రయించును. అతడు తులసిని చాల త్రిప్పలు పెట్టును. ఎన్ని పెట్టినను తాను హనుమంతుడను కానని యనడు. 'దారులుకొట్టు దొంగవలె నన్నుఁ బట్టుకొని బాధింతువా? తత్త్వజ్ఞానము ధనమా, ధాన్యమా, ఏమి యనుకొంటివి? ముసలివానిని బాధింతువా' అనును, అంతియేకాని నేనెవడను? హనుమంతు డెవడు? నాకును వానికిని సంబంధ మేమి? ఇట్టి యబద్ధపు మాట లనఁడు. ఇది గొప్ప యౌచిత్యము. ఇది యంద

రకును దెలియునా? కనుక శాస్త్రవిషయములు మాత్రమే యందరకు తెలియవు, తక్కినవన్నియు తెలియును, అన్న మాటలో యాథార్థ్యములేదు. శబ్దములయొక్క యర్థముల వలె శాస్త్రగతవిషయములుకూడ తెలిసికొనినచో తెలియును. ఇట్టియౌచిత్యములు పాఠకుని ప్రతిభావిశేషముచే తెలియును. పాఠకులుకూడ కవివలె ప్రతిభ సంపాదింపవలెను.

ఈ యాంజనేయుడు తులసిని యింకను బరీక్షచేయును. దారిలో ఒక పెద్దమేడ కల్పించి అందులో నొక నవమోహ నాంగిని సృష్టించును. ఆ స్త్రీని ఆ విప్రుడు పోయి కౌగిలించు కొని బలవంతపెట్టును. ఆమె తులసితో మొఱ్ఱపెట్టును, "ఓ నవ మోహనాంగుడా! 'ఈ మానవరూపకీశము' నన్నవమాన పఱుచుచున్నాడు' అని. ఈ మాట పైకి వట్టి నిందగానున్నను, వేరొక విగ్రహముచేత నతడు హనుమంతుడని చెప్పుచున్నది. ఇది మఱియు నౌచిత్యము. తులసిని హనుమ పరీక్ష చేసెను. ఆ పరీక్షలోకూడ వంచనచేయడు. మోసము చేయడు. భక్తుని తప్పుదారి పట్టించడు. అతనిభక్తి దృఢమైనదా కాదా అని మాత్రమే పరీక్షించును.

తులసిభార్య మమత. ఆమెయనిన కొన్ని వెగటుమాట లకు కోపమునుండి లేచిపోయెను. అతడు లేచిపోయినతరువాత నామెకు భర్తృవిరహబాధ తెలిసెను. ఆ తెలిసిన మమత ఆ విరహ మనుభవించును. భర్తను వెడలగొట్టితినే యని పరిత పించును. ఈ పరితాపమంతయు విరహశ్శృంగారముగా వర్ణించ బడెను. ఆమె రతిదీనవలె కనిపించును. ఈ దుఃఖము శృంగార రసమయము చేయుటకాని, తరువాత ఆమె కాశిలో సత్రము

పెట్టినప్పుడు భర్త యక్కడకు రాగా మరల నతనిని కలియ వలయునను భావమే ప్రధానముగా నామె యందు గోచరించుట గాని కథావస్తువునం దొక సమతను సమకూర్చుచున్నది. తులసియందు పరిపూర్ణ వైరాగ్యము, ఆమెయందు సంపూర్ణ కామము—ఈ రెంటియొక్క కథాసమ్ప్రవసారము, చివరకు తులసియొక్క వైరాగ్యమే గెలుచుటయు కథయొక్క యాయువుపట్టు. ఆ వైరాగ్యమట్లు భాసించుటకు ఈ కామమింత గాఢముగా చూపించవలయును. తత్ప్రయోజనాకాంక్షయే మమతయందలి ఈ కామభావము నిట్లు ప్రపంచింప చేసినది.

ఇది కథయందలి ప్రధాన మహావిషయము

పద్యరచన, తదితరములైన యనేకములైన రమ్యవిషయములు-వానినిగూర్చి వేఱ చెప్పవలయును. ఈ కవి యమకము శ్లేష, వీనియందు మిక్కిలి యనురాగము కలవాడు. "గురు మథన మన్న" శబ్దము శ్లేష. ( పు॥ 18 )

"కాపుర మిది యెన్నగ లంకాపురము" ( పు॥ 22 )

"మదనాగమాభ్యసనదీక్షాతత్పరత్వంబునన్ మద నాగం బటు" ( పు॥ 54 )

"గోరంటిన కోపమేల యిటు లాక ననుఁ గానిలువంగ నేను గోరంటనె" (పు॥ 77)

"మారురూపమువాడిట్లు మారురూపువడుట"(పు॥ 112)

"కర్బురములకు నిది మూలకంద మగుట కర్బురంబని జగతి విఖ్యాతి గాంచె" (పు॥ 138)

ఇట్టివి తఱచుగా నుండును.

ఈ కవి కవిత్వమునందలి పద్యరచన సుప్రసిద్ధులైన ఏ పూర్వకవినో తీసికొని యిట్లుండునని చెప్పుటకు వీలులేదు. కథ వెంబడింబోవుచో నెప్పటికప్పు డేవో క్రొత్తకల్పనలు కల్పించు కొనుచు, బోవువారికిఁ బద్యరచనయందు తచ్ఛిల్పము నందు నిష్ఠయుండదు. ఆ పద్యము అప్పుడు ప్రసక్తమైన భావ మును సువ్యక్తముగా చెప్పుటకే ప్రవర్తించును. పూర్వమహా కవ్యాచరితపథమునందు పోవుటకు ప్రయత్నించదు. ప్రథమా శ్వాసమున రామునిగూర్చి తులసి తనగోడు చెప్పుకొనుట, రెండవ యాశ్వాసములో విశ్వేశ్వరుని గుడిలోనికి పోయి ఆ స్వామియెదుట స్తోత్రములు పలుకుట, తృతీయములో దేవీ స్తోత్రము, ఆ దేవీస్తోత్రము అ ఆ ఇ ఈ మొదలుపెట్టి అక్షర సమామ్నాయమంతయు ప్రతియక్షరము,ఒక్కొక్క పద్యాదిగా నియమించుచు వ్రాయుట, చివరకు, పంచమాశ్వాసము రామ కథయంతయు, సంక్షేపముగా గాయత్రీమంత్రవర్ణములు పద్యా ద్యక్షరములుగా నియమించుకొని వ్రాయుట- ఇన్నినియమము లలో పద్యము దానియంతట నది యొక మాధుర్యపు పుంత పట్టి నడువదు. ఆ నియమములు ఈ నడకను నియమించును. ఈ పద్యము ఆ నియమములను గొంత భంగించును. ణి కారము మొదటగల శబ్దమేది? అందుచేత ప్రేరణార్థకమైన "ణిచ్" యొక్క ప్రసక్తి. (పు॥ 157) ఇట్లు నియమములు పద్యము చేత, పద్యము నియమములచే కొంతకొంత మార్పు పొందక తప్పదు.

ఈ కవియొక్క ఊహాశక్తి, మంత్రశాస్త్రముతోడి పరి -చయము, సంప్రదాయములైన బహువిషయములయొక్క పరి

జ్ఞానము, ఈ స్తోత్రములయందు సర్వాంకషముగా ప్రకాశించెను. ఒక్కొక్కచోట నీయన యూహా సెబా సనిపించును. 'లవ కుశులు సవనహయమును బట్టి తండ్రి నెదిరించిరి. తప్పెవరిది? నేను నీకెవడను' ఇది తులసి రామచంద్రునిగూర్చి వేసినప్రశ్న. ఈ భావమునందలి రమ్యత సహృదయహృదయంగమము.
(పు॥ 22)

దశరథుడు రాముని విరథునిచేసి యడవికిఁబంపెను. తులసి రామునకు తన మనోరథ మిచ్చునట. (పు॥ 24)

ఇంద్రుడు తనస్వర్గరక్ష కొఱకు భగవంతునకు సూకర ముఖ్య నీచ భవ శోకము కట్టిపెట్టెనట. (పు॥ 24)

రాముని పాదపద్మములు చక్రాతిబండను స్త్రీగాఁ జేసెను. చపలచిత్తము నేమిచేయును. దానికన్న పాషాణ మైన మేలట. (పు॥ 28)

ఇవి శ్రీరామచంద్రస్తోత్రములోని మధురోహాలు.

దుర్వాంఛలు దశాస్యుని శిరంబుల్ వోలె ముహు ర్ముహు రుద్భూతము లవుచున్నవట. దానికి బగళాంబానాథు డైన విశ్వేశ్వరుడు బ్రహ్మాస్త్ర మనుగ్రహింపవలెనట. 'బగళాం బానాథ' యన్న సంబోధనము మంత్రశాస్త్రవిషయపరిజ్ఞా నము. శివుడు బ్రహ్మాస్త్ర మిచ్చుట సంప్రదాయము తెలియుట.
(పుట 42)

తులసి, దేవీస్తోత్రము చేయును. ఇవి చాలపద్యములు. అక్షరసమామ్నాయ మంతయును రావలయును. ఇంత పెద్ద స్తోత్రము రసభంజక మనిపించవచ్చును. కాని యిన్నిపద్యముల స్తోత్రము కావ్యములో నౌచిత్యము సంపాదనచేయు స్థలమున

నున్నది. తులసి మమత సత్రమున కేగెను. మమత తన భార్య యని తెలిసికొనెను, ఆమె తన్నచట నుండు మనెను. తానుండ వలయునా ? వలదా ? వలచుట దోషము. "ఒల్లనను పట్టును దప్పె, తలంపు లేక ముక్తులు విధి చొప్పుబట్టి సమకూడిన వెల్లను సమ్మతింతురు" అని గురువు చెప్పెను. (పు. 91)

అందుచే తానంగీకరించెను. భార్య సన్నిధియందుండి, తన బ్రహ్మచర్యమును, తన వైరాగ్యమును, తానెట్లు సాగించు కొనును? ఈ మనస్సుపడ్డ కష్టమంతయు, కలవరమంతయు, నీ దేవీస్తోత్రములో నిమిడియున్నది. ఇట్లు కథాంగమైనది పెరిగి పోయి, వికారము కాదగినది, యౌచిత్య సంపాదనముచే వేరొకభావముచేత నది ప్రధానకథను మ్రింగకుండ చేయుట. ఈ స్తోత్రమంతయు, తులసి మనస్సులోని యావేదననే తెల్పును.

అనింధనమై చిదగ్ని యుండునట. దానిలో పృథ్వీః ద్దొట్టి త్రిపురాంతకు దాకను తులసి వేల్చునట. ఇది సామా న్యున కందుభావముకాదు. నిత్యవేదాంతజిజ్ఞాసువై, సంప్ర దాయమునందు మునిగి తేలుచున్న బుద్ధికి తట్టు భావము. అను వాదమైనను ప్రశంసనీయము. (పుట 97)

దేహాత్మ జీవభ్రాంతి పొంది సంసృతిలో తగుల్కొనుట పనసపండు తొనలు తీయలేక బంకలో తగుల్కొనునట్లు' అన్నది క్రొత్తపోలిక. (పు 103)

ఉజ్జ్వల సూర్యోదయ మండలద్వయ విరాజద్దివ్యసౌవర్ణ కుండలినీ అన్న సమాసపుకూర్పు చాల మధురముగా నున్నది. సహస్రనామములలోని దైనను కూర్పు వేఱుగదా. (పు 103)

ఇంత స్తోత్రము తులసీదాసు కవియగుటలో మరికొంత యశౌచిత్యము సంపాదించుకొన్నది.

తాను కాళమతమెఱుగడట. క్రతుదీక్షలు పూననేరడట. 'ఈ – ఈ' యని కూపెట్టునట. అంబ కులశేఖరి. కౌళమార్గతత్పర. లలిత కిట్టివెన్నో పేర్లు. ఉపాసకుడు కానివాని కివి తెలియవు. 'ఈ – ఈ' యని కూపెట్టుటలో శ్లేష. 'ఇమ్మి' అని యర్థము. నేను నీరహస్య మెరుగలేను. వట్టి డబ్బుకావలసిన వాడను అని పై యర్థము. 'ఈ' యన్నది కామకళా బీజము. ఇట్లు చమత్కారముగా పొదుగబడినది. (పు 109)

కవికి సంప్రదాయము, యజ్ఞములు, యజ్ఞకర్తలయొక్క సంపూర్ణవైరాగ్య భావము–వీనియందు, నిశ్చయమైన జ్ఞానము కలదు. వృద్ధవిప్రుడై తులసియొక్క వైరాగ్యభావమును తెలిసికొనుటకు వచ్చిన హనుమంతుడు తులసితో నిట్లనును. "విశ్వజిద్యాగదీక్షాపవిత్ర వంశసంభవుడైన శ్రీ రామచంద్ర దివ్యనామ జపితల యీావికి నవధి కలదా యని."

ఈ రీతిగా ఈ గ్రంథమునందు బహు గుణములు చూపించవచ్చును. గురుశిష్యుల నడుమగల సంబంధము, స్త్రీ పురుషుల నడుమగల ప్రేమ వీనికి సంబంధించిన పరమ రహస్యములు, శృంగారవిషయములో కాళిదాసు చెప్పదగిన భావములవంటి భావములు, ఈ గ్రంథమునందు చాలకలవు. వాని నన్నిటిని చెప్పినచో గ్రంథవిస్తరమగును.

మఱియొక్క విషయముమాత్రము చెప్పెదను. గురుశిష్యసంప్రదాయము ఈ కవి కభిమానవిషయము. జీవిత

మంతయు నా సంప్రదాయములోననే మునిగి తేలినవాడు. అందుచేతనే ఈ కథను పట్టుకొనె ననుకొందును. వట్టి రస ప్రధానమైన మఱియే కథావస్తువు తీసికొన్నను, ఈ కవిరచన దివ్యపథవిహారము చేయును, అనుటకీ కావ్యమునందే రెండు గొప్ప యుదాహరణములు కలవు. తృతీయాశ్వాసములో, మమతయు నామె యత్తగారును తులసీదాసును వెదకుటకు బయలుదేరిరి.

"ఆ సౌందర్యవతీవతంసము లసూర్యంపశ్యలై యుంట నే
మో సాలాదిమహీజ గుల్మలతికా వ్యూహ వ్యాప్తకీర్ణాటవీ
దేశాధ్వంబుల నాత్మశోకదవహేతివ్రాతమే మార్గమున్
వాసిం జూపగ సాగి రంత వనసత్త్వశ్రేణి లెక్కింపకే. (పు॥81)

ఈ పద్యముయొక్క యెత్తుగడ, ఈ పద్యముయొక్క నిర్వాహణము చూచినచో ఈ కవి యింకను గొప్ప గ్రంథము వ్రాయుటకు కావలసిన శక్తి ప్రోదిచేసికొనినవాడని తెలియును.

ఈ కావ్యములో గురువు స్వరూప నిరూపణము చేసెడివాడని చెప్పుటకు ఒక చిన్న ఉపాఖ్యానము కలదు. అది సింహపుపిల్లకథ. చతుర్థాశ్వాసమున 125 పుటలో 3వ పద్యము మొదలు 130వ పుటవరకు, నీకథ యున్నది. ఆ కథా రచన చూచినచో, వలసినచో కవి యెంత రసవత్తరముగా వ్రాయకలడో తెలియును. ఆ రచన కదియేసాటి. అది తిక్కన రచనవలె నున్నది. ప్రత్యక్షర రసస్ఫోరకమైన రచన.

విశ్వనాథ సత్యనారాయణ
బెజవాడ.

శ్రీరస్తు.

# పండితాభిప్రాయములు



బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ
కవిసార్వభౌమ ఆంధ్ర వ్యాసేత్యాది బిరుదాంకితులు
## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు

బ్రహ్మశ్రీ దంటు శ్రీనివాసశర్మ, అడ్వొకేటు వారిచే రచింపబడిన "గురుభక్తి - శ్రీ గోస్వామి తులసీదాస చరిత్రోత్తరఖండ"మను మహాగ్రంథమును నేను యథావకాశముగాఁ జదివి విని యానందించితిని. ఉత్తర హిందూస్థానమున నీ తులసీదాసు ప్రసిద్ధి విశేషించియున్నది. ఇతఁడు హిందీ భాషలో రచించిన రామాయణము నా దేశస్థు లెల్లరును వాల్మీకి రామాయణముం బలెఁ బూజించి పారాయణమును జేయుచుందురు. దానిని బరంపురములో నా మిత్రు లొకరు తెలుగునఁ బద్యకావ్యముగా రచించిరి. నేను దానిని బఠించి తులసీదాసు మహత్త్వం బిట్టిదని గ్రహింపగల్గితిని. అందనే కాద్భుతప్రదర్శనము లున్నవనుటతిశయోక్తి కానేరదు. గీర్వాణభాషలో గాళిదాసుండు బలె నాంగ్లభాషలో షేక్స్పియరువలె హిందీభాషలో నీ తులసీదాసుడు వన్నె గాంచెనని యెన్ని సంతసించితిని. అతఁడు పరమపవిత్రు డనియు మహర్షి

తుల్యుండనియు వాసనెల్లరు నర్చించుటంజేసి సులభముగా దెలిసికొన వచ్చును.

అట్టి మహానుభావుని దివ్యచారిత్ర మాంధ్రభాషలో రచించు భాగ్యము, మహావిద్యోపాసకుండును తత్త్వజ్ఞాన సంపన్నుండు నగు శ్రీనివాస విద్వత్కవివరేణ్యునకు గల్గినందుల కెంతయు నానందింపవలసి యున్నది.

ఇది తులసీదాసచరిత్రలో నుత్తరఖండమైనను దీనికి 'గురుభక్తి' యని ప్రధాననామకరణ మొనర్పబడినది. ఇందుఁ దులసీదాసుండు గురుభక్తింజేసి తత్త్వవేత్తయై మోక్ష సామ్రాజ్యం బొందుటంజేసియో, కవికి గురుతుల్యుండగు నగ్ర భ్రాత సుబ్బావధానిగారిని భక్తితో భావించి వారికీ కృతి ఖండము కృతియిచ్చుటంజేసియో, దీనికీ నామ మంకింపబడిన దని యూహింపనై యున్నది. ఇందు మొదటఁ బీఠికగా వ్రాసిన పద్యములు కొన్ని చదివినప్పుడిక్కవి తత్త్వజ్ఞానసంపన్ను డనియు కథలోని కొన్ని ఘట్టములు చదివినప్పుడు భక్తి సంపన్నుడనియు బాఠకమహాశయులకుం దోపకమానదు. నిజంబరయ నిక్కవిచంద్రుడు నిర్లిప్తుం డనియుఁ గులాలకీట న్యాయంబున సంసారం బనుసంధించుచుండె ననియుం జెప్పుటకు వెనుదీయ నక్కర లేదు.

మఱియు నీ గ్రంథము గురుభక్తి, దైవభక్తి, భర్తృ భక్తి చక్కఁగ దెలియజేయుటయేకాక తత్త్వజ్ఞానమును ముక్తి మార్గమును బోధించుచున్నది. ఇందు కరుణరసము, కరుణా రసము, శృంగారము, బీభత్సము, అద్భుతము లోనగు రసము లందందుఁ బొందుపడి యున్నవి. కవిత్వము నాతికఠినమ్మురు

మధుర శైలిం దవిలి యున్నది. ఇందు దులసీదాసుడు శ్రీరాముని స్తుతించు ఘట్టము, త్రిపురసుందరిని బ్రస్తుతించు ఘట్టము మంత్రరాజముం దెలుపు ఘట్టము నెంతో మనోహరముగ నున్నవి. కవిగారు పురాణవిద్యాభ్యాసముఁ జేసిన వారయ్యు నిట్లు మనోహరమహాగ్రంథమును రచింపఁగలిగి రనినప్పుడు వారికిఁ బరమేశ్వరీ సాక్షాత్కారము గలదని చెప్పకతప్పదు. ఈ విషయమున బమ్మెర పోతరాజు చరిత్రము తార్కాణమగుచున్నదని మన మూహింపవచ్చును. పోతరాజేమియుఁ జదువలేదనియు సహజ పాండిత్య మతనికిఁ గలిగినదియు మన మెఱుంగుదుము. అతని భాగవతము మహోన్నతమని మనమూహింపకుందుమా? అట్లె యిమ్మహాకవి కవిత్వము నని మన మూహించుటలో పొరపాటుండబోదని నా నిశ్చయాభిప్రాయము.

క. ఓ శ్రీనివాస కవివర!
సుశ్రీకంబయిన నీదు సుషమ కవిత్వం
బశ్రాంతవినుతబుధజన
విశ్రుతమై వన్నెకెక్కు విపులాస్థలిలోన్.

మకాం
బెజవాడ.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.



శ్రీమత్పరదేవతాయైనమః

బ్ర॥ శ్రీ॥ కింకవీంద్రఘటాపంచానన, కళాప్రపూర్ణ, మహాకవి
శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు.

# గురుభక్తి

అను నీ పొత్తము శ్రీ తులసీదాస చరిత్రములోని ఉత్తరఖండము. దీనిని రచించిన కవివతంసుడు దంటు శ్రీనివాసులుగారు. వీరిది పండితవంశము. నేను వీరి సోదరులు, కీ. శే. సుబ్బావధానిగారిని మాత్రమేకాదు, వీరి తండ్రిగారిని సైత మెఱుగుదును. ఆయన మంచి సాహిత్యము కలవారు. శ్రీ నూజవీటి ప్రభువులలో నొకరగు శ్రీ వరదరాజప్పారావు గారి యొద్ద దివానుగా నుండిరి.

"ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్రం శాపాదపి శరాదపి"

వీరి సోదరులందఱును ఆ యీ శ్లోకమునకు లక్ష్యభూతులే. పార్థసారథిగారీ కవికి వేఱొక సోదరుడు. ఆయనకూడ సంస్కృతాంధ్రసాహిత్యములే కాక వైద్యశాస్త్రము నందును బ్రవీణుడు. పైగా ఆంగ్లభాషలో నీ సోదరులు ముగ్గురును మంచి ప్రవేశముకలవారే. అందులో ప్రకృత గ్రంథకర్త న్యాయవాది పరీక్ష నిచ్చి ప్రాక్టీసు చేయుచు నా యీ యుత్తమగ్రంథము రచించెను. ఈయన కీ రచన అప్రధానమే యయినను ప్రధానముగా నీకవిత్వోపాసన చేయువారి రచన కియ్యది యేమాత్రమును దీసిపోవుట లేదు. ఆంధ్రభాషారహస్యము లెన్నియో యీ కవికిఁ దెలియునని ప్రయోగములవలన నవగతమయ్యెడిని. ఇందుల కుదాహరణములు చూపునెడల గ్రంథము పెరుగు

నని యుపేక్షించితిని. ఆ యీ కబ్బము భక్తివైరాగ్యముల కాటపట్టయ్యును శృంగారమును దూరీకరించలేదు.

తే. గీ. యతివిటుడు గాకపోవు బెట్లన్మదీయ
కావ్యశృంగార వర్ణనాకర్ణనమున
విటుడు యతికాకపోడు......

(కవికర్ణరసాయనము)

అను పద్యార్థమున కీ కబ్బము లక్ష్యముగా నున్నదని నా నిష్కృష్టాభిప్రాయము. ఆయీ యుత్తరఖండ మారంభించుచు నీయన యొకానొక పుణ్యపురుషుని దాతృత్వమును గూర్చి ప్రస్తావించియున్నారు. అందు లేశమును నతిశయోక్తి లేదని తద్‌జ్ఞు లానందింతురు. తులసీదాసువంటి పరమ భక్తాగ్రేసరుని చరిత్రమునం దాయీదానవీరుని దాతృతావేశమును స్వాత్రీకరించుట యిక్కిలిగా నభినందనీయము - సామాన్యముగాఁ గవిత్వమును గూర్చి వ్రాయుమాటలు - సలక్షణము, ధార ధారాళము-లోనైన వీయన కవిత్వమును గూర్చి వ్రాయ నక్కరలేదు. ఎంతటి కఠినప్రాస మెత్తుకొన్నను, నన్నయామ లకుంబలె నీకవికి నశ్రమముగా ధార దొరలినదం చదువరులకు దోపకమానదు.

శ్లో. "పురాణ మిత్యేవ న సాధుకావ్యం
... ... ... ...
సంతః పరీక్ష్యాన్యతర ద్భజన్తే"

శ్లో. "కవిః కరోతి కావ్యాని లాలయ త్యుత్తమో జనః
తరుః ప్రసూతే పుష్పాణి మరుద్వహాతి సౌరభం"

బెజవాడ
8—7—45

వెం. శా. శతావధాని,
శ్రీ రసాగరము.

అభినవతిక్కన, బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు

ఏతత్కృతి పూర్వఖండరచనచేతనే దంటు శ్రీనివాస శర్మగారు ఆంధ్రులకు సుపరిచితులు. ఆ భాగము చెన్నపురి విశ్వవిద్యాలయమువారు బి. ఏ. పరీక్షకుఁ బఠనీయము గావించి రని యాలించుచున్నాను. ఈ యుత్తరఖండము పూర్వ కవితకెందుఁదీసిపోక, కొన్ని విషయముల దానికన్నమిన్నగానుం గానిపించుచున్నది. ఇందలి యితివృత్తము తులసీదాసు విరక్తుఁడై కాశికాపురిం జేరుటతో నారంభమగుచున్నది. తండ్రి స్వప్నమునఁ జెప్పిన చొప్పున తులసీదాసు కాశికాపురిలోఁ బండ్రెండేఁడు లన్వేషించి కడకు హనుమద్దర్శనము వడయుట, ఆ పట్టణములోనే ధర్మసత్రము నెలకొల్పి తపస్వినియై యున్న తన యిల్లాలి నావలఁ గొంత కాలమునకుఁ గలసికొనుట, వీ రిర్వురు నొండొరుల గుఱితించుకొని యసంగులై గృహస్థ ధర్మము నిర్వహించుట, అనునవి యీ భాగము నందలి ప్రధానాంశములు. ఇందు తులసీదాసు నిర్వేదము, హనుమంతుఁ డతనిఁ బరీక్షించిన తెఱఁగు, అనుగ్రహించిన ప్రకారము చదువరుల మనసు కరఁగునట్లు వర్ణింపఁబడి యున్నవి. మమతాదేవి (తులసీదాసుభార్య) స్వయము జ్ఞానవతియయ్యు పతిభక్తి చేతంగాని కృతార్థత బొరయనేర నని విలపించుపట్ల ఆర్య స్త్రీల సనాతన ధర్మానురక్తి స్ఫుటముగాఁ బ్రతిబింబిత మగుచున్నది. అవకాశము కల్పించుకొని కవిశేఖరుఁడు ఇందు తులసీదాసుచేత, భాగీరథీ స్తుతి, విశ్వేశ్వరస్తుతి, అక్షరమాలికారూపముననుు, పంచదశీ వర్ణానుసారముగాను అన్నపూర్ణాస్తుతి, కడపటి భాగమున

గాయత్రీరామాయణ వివరణము గావించి తన కృతికి అతి మాత్రమైన పవిత్రతఁ జేకూర్చుకొని యున్నాడు. శ్రీనివాసుని చేతిలో స్పర్శవేధియున్నది. అతఁ డేది తాకినను అది సువర్ణ మగుచున్నది. కాకున్న ఒక్కొక్క విషయము నింత యౌచితీ ధూర్వహముగాను, క్షోదక్షమముగాను వర్ణింపఁగలఁడా ? శర్మ గారి కీ శక్తి యలవడుటకు, వారు కావించిన సారస్వతోపాస్తి కన్న, పురాకృత పుణ్యమున వారికి లభించిన గురుభక్తియే కారణమని నేను తలంచుచున్నాను. శంకరభగవత్పాదులు గురుప్రభావము నెట్లు వర్ణించి యున్నారో తిలకింపుడు.

"దృష్టాంతో నైవ దృష్ట స్త్రిభువనజఠరే సద్గురో ర్జ్ఞానదాతుః
స్పర్శశ్చే త్తత్రకల్ప్యస్సనయతి యదహో స్వర్ణ తామశ్మసారమ్
న స్పర్శత్వం తథాపి శ్రితచరణయుగే సద్గురు స్స్వీయశిష్యే
స్వీయం సామ్యం విధత్తే భవతి నిరుపమ స్తేన చాలౌకికోఽపి"

శ్రీనివాసుని కవనమునఁ గైతవము లేదు. కృత్రిమత్వము లేదు. అనవసరమైన శబ్దాడంబరము లేదు. భావమెంత గభీర మైనదైనను వాక్కు ప్రసన్నము. ధార అనర్గళము. పద్యము లొక్కొక్కటియుఁ దీర్చి దిద్దినట్లుండుటయగాక, కథాకథనము నను కౌశలము కానవచ్చుచున్నది. పంచదశితోఁ గూడిన యక్షర మాలికా స్తవము కథావేగమునకుఁ గొండొక యడ్డుగాఁ బొడకట్టుంగాని, యందలి యాశయవైశిష్ట్యముం బట్టియు, ఋ, ౠ, ఙ, ఞ మొదలగు నక్షరములఁ బద్యాది గ్రహింప వలసినచోటఁ గవి చూపిన నైపుణిం బట్టియు, అది విసువు గొలుపక యుల్లమున నుల్లాసమే కావించుచున్నది. కవికిఁ

దత్త్వదృష్టి మెందు. కావున నాతని కెల్లసందర్భముల నుపనిష త్ప్రతిపాదితార్థములే కానవచ్చుచుండును.

"మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః"

అను గీతోక్తి ఈపద్యమున నెట్లు పరిణతమై యున్నదో పరికింపుడు.

చ. స్వదమున వానరోత్తములు జానకియున్కి నెఱుంగ నద్దెసల్
వెదకుచుఁబోయి జాడఁగనలేక యెక్రమ్మఱివచ్చిరంట య
ర్బుదముల నెన్నవచ్చును ముముక్షుజనంబులసంఖ్య, దానిలో
నొదవును దత్త్వదర్శనసమున్నతి యే యొక పుణ్యరాశికో.
(195 పుట)

చ. గ్రహములఁ బెద్దయయ్యు నవికత్థనుఁడై శశి కాత్మ తేజమున్
మిహిరుఁడసూయలేకొసఁగి మిత్రుడు దానయిరాజుగా నను
గ్రహమున వానిఁజేయు నదిరా! పరతత్త్వమెఱింగినట్టి ని
స్స్పృహులగు దేశికోత్తములు శిష్యుల కున్నతులిత్తురిక్రియన్.
(13వ పుట)

ఈపద్యమున శ్లేషసాహాయ్యమున గురులనైస్స్పృహ్యా మెట్లు చమత్కరింపఁబడినదో చూడుడు. ఇట్టి క్రొత్త యూహాలు గ్రంథమునఁ బెక్కెడలఁ గానవచ్చుచున్నవి.

"యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః"

ఇవి గాక స్తవములలోఁ గొన్ని పూర్వాచార్యుల వాక్కుల కనుకరణములుగా నున్నవి.

శ్లో. "అంతర్నిరంతరనిరింధన వర్ధమాన
మోహాంధకార పరిపంథిని సంవిదగ్నౌ
కస్మింశ్చి దద్భుత వికాసమరీచిభూమా
విశ్వం జుహోమి వసుధాది శివావసానమ్"

అనుశ్లోకము భాషాంతరీకరణమని తోపకుండ నెంత సుఖముగాఁ దెనిఁగింపఁ బడియున్నదో యారయుఁడు.

చ. గనగన నాత్మలోపల నఖండముగా వెలుగొందు నే దనిం
ధనమయి మోహసంతమసదారకమౌచుఁ జిదగ్ని నాఁగ నం
దనయము పృథ్వి దొట్టి త్రిపురాంతకు దాఁకను వేల్తు విశ్వమె
ల్లను బరిధూతభక్తనిగళా! బగళా! శ్రితలోకమంగళా.

( 97 పు. )

రసవంతమయ్యును కావ్యము ఉపదేశము కలది కాదేని పురుషార్థప్రదము కానేరదు. నేఁటి కవులలో రసవత్తరముగా వ్రాయఁగల కొందఱు తమ లేఖినుల సత్కావ్య రచనము దెసకుఁగాక "కామోపభోగపరమా, ఏతావదితి నిశ్చితాః" అను నధిక్షేపమునకు లక్ష్యములగు కథల, ఖండకావ్యముల, నాటకముల, ఆఖ్యాయికలరచనము వంకకు మరల్చి యిప్పటికే విషయలాలసములై మలీమసములై యున్న యువమానసముల నధఃపతితములఁ గావించుచున్నారు. సామాన్యు లెట్లు వ్రాసినను వారి కృతులు వారితోనో వారికంటె ముందుగానో యంతరించి పోవుఁగాన చింత లేదు కాని సిద్ధహస్తులగు ప్రశస్త కవులు తమ ప్రజ్ఞ యిటు వినియోగించుట శోచనీయము. కావ్యము నీతిశాస్త్రము కామి నిక్కమే, కాని యది "విశ్వశ్రేయ"మునకుఁ దోడ్పడకున్నను విశ్వారిష్టమునకు దారితీయు

నది కాఁగూడదుకదా! వినోదము కేవల మానందమునేగాక విజ్ఞానమునుం బ్రసాదించునదియైన నది బంగారమునకుఁ బరిమళలాభము.

ఈ తులసీదాసచరిత్రలోఁ జక్కని యుపదేశమున్నది. దానికి మెఱుంగుపెట్టినట్లుగా శర్మగారు ఈ కృతిని భక్తిపూర్వకముగా నన్నగారి కంకితము సేఁత ఉపదేశము; తనహృదయమున సారస్వతబీజము నాటిన కవయిత్రీమణికి "కనకమాంబ"గారికిఁ గృత్యాదిఁ గృతజ్ఞత దెలుపుకొనుట – ఉపదేశము; విద్యాపీఠమునకుఁ బ్రాణమై నిలిచి దానత్యాగములకు కర్ణుడని పేరందుచున్న సతీర్థ్యుని శ్రీ చుండూరు వెంకటరెడ్డిం గొండాడుట – ఉపదేశము; అన్నింటికన్న నిర్మముఁడు, కీర్తిపరాఙ్ముఖుఁడు" నగు స్వీయగురుని అమృతానందనాథుం బేర్కొని "అనుగ్రహవైశిష్ట్యము ఛాత్రసత్కృతులలోఁ గాన్పింపదే తెల్లమై" అని వారిపేర్మి నభినందించుట – ఉపదేశము.

ఈ హృద్యకృతి పఠనీయమై విద్యార్థుల కరముల నలంకరించుటయగాక, దేశమున వ్యాప్తికి వచ్చి జిజ్ఞాసువులకు ముముక్షువులకు భక్తులకు హృత్తాపోపశమనముం జేయు సుధాధార గావుతమని యాకాంక్షించు చున్నాను.

నెల్లూరు
12-7-1945

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ.



# శ్రీ తులసీదాస చరిత్రము

## 1 వ భాగము



పత్రికాభిప్రాయము—కృష్ణాపత్రిక 7-5-38

(గ్రంథకర్త: దంటు శ్రీనివాసశర్మగారు, బి.ఏ.బి.యల్.)

ఇందు వాల్మీక్యంశసంభూతుడైన శ్రీ తులసీదాసుని జీవితమును విస్పష్టముగా తెలుపుటయె గ్రంథోద్దేశ్యమని గ్రంథ నామమువలననే తెలియఁబడుచున్నది.

ఆదికవి వాల్మీకిచే గానము చేయబడిన శ్రీమద్రామా యణమున కెట్టి పూజ్యభావము దక్షిణాపథమున గలదో, యట్టి గౌరవాతిశయములతో నుత్తరహిందూస్థాన ప్రజలచే పూజింపఁ బడు నుత్కృష్టగ్రంథరాజ మనదగు శ్రీ తులసీదాస రామాయ ణమునకు కర్తయైన యీ భక్తాగ్రగణ్యుని చరిత్ర మందర కానందదాయకమనుట శ్రీ శర్మగారే "భగవద్భక్తుల చరితలు, భగవంతునిచరిత లగుట" సుస్పష్టపఱచిరి.

ప్రబంధ మన కఠినసమాసజటిలమై, విపశ్చిద్వర్యులకు మాత్ర మందుబాటులో నుండునట్టి, దీర్ఘవర్ణనాసంకలితంబైన కావ్యమని జనుల సాధారణాభిప్రాయము. అట్టివానియెడ సాధారణముగా నేరికోగాని యాదరణముండదు. కాని యిందట్టి యభిప్రాయములకు చోటీయక, సరళమైన యనర్గళధారా శక్తితో, ద్రాక్షాపాకమున కావ్యము నంతటిని గూర్చుట కవి యసాధారణప్రజ్ఞను చాటును. ఇందు పదములకు దడవికొని నల్లిచ్చుటను గానము. గ్రంథము ప్రారంభించినది మొదలు తుదివరకు చదువుదనుక యాపుట కెడమీయని శైలి. మొదటి

భాగమున గల యైదాశ్వాసములలోని యితివృత్తము స్వల్ప మైనను, రసౌచిత్యమున కనుకూలములగు కథలతోడను, స్వభావోక్తులతోడను, లోకానుభవములతోడను, సాతిదీర్ఘవర్ణనల తోడను మనోహరముగ రచియించిరి. ప్రథమ భాగమందలి కథాసంపుటియు, శైలియు, ద్వితీయభాగమున కెంతయు నాతురతను గలుగజేయుచున్నవనుట యతిశయోక్తి కాదు. ఇందాంధ్రయోషామణి తిన్ననైన నడకలే గాన్పించును గాని ప్రబంధ మహాభూత ప్రళయతాండవము మాత్రము చూపట్టదు. నిర్వచనకావ్యమైనను చక్కని నవలవలె నడచును. ఆంధ్ర భాషాభిమానులెల్లరు తప్పక పఠింపఁదగిన గ్రంథము. భాషా శుద్ధిగలదు. పట్టపరీక్షకు బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడుటయే దీని ప్రాశస్త్యమును వెల్లడించుచున్నది.

తులసీదాసు వేశ్యాలోలుఁడై బ్రాహ్మణకృత్యములకు దూరుఁడై యమాత్యపదవిని సహితము తృణప్రాయముగ నెంచి గణికాసంగమానందమోహాంధుఁడై, ప్రపంచసర్వస్వము నంధకారబంధురముగ నెంచుట వెలయాలి వెలలేని నటనా చమత్కృతియా? కాముకుల హృదయదౌర్బల్యమా? కనుకనే బుధులు "బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి" యని వాకొనిరి. ఇప్పట్టున విషయము కడు స్వాభావికముగ వర్ణింపఁబడెను. వేశ్యమాత పల్కులందలి యతిశయోక్తులు కాముకవ్యాపారబధిరులకు స్వభావోక్తులుగదా! వేశ్యాగ్రహామావేశించిన సందర్భమున "విశ్వమెల్లను లోవెలివేశ్యగాగ" "చేపవలబడ్డ విధంబున" యనుట యెంతయు స్వాభావికము.

భర్తసౌఖ్యమే తన సౌఖ్యముగా నెంచుకొని పరభామా

సాంగత్యమున కెంతయు తోడ్పడిన మమతాసూక్తు లెంతయు నామె పతివ్రతాత్వమును వెల్లడించుచున్నవి.

"పుణ్యాగరిమను చంద్రు లావణ్యసుధను
దానె గ్రోలి చకోరి యుద్ధతి వహింపఁ
బగ వహించునె ? తొంగలిన్న పంకజారిఁ
గనులఁగాంచిన మాత్రనె కనదె ముదము"

రాజునకును మంత్రికిని గల యన్యోన్యానురాగమునకు బల్కిన సూక్తులు.

"భవమిది దుర్భరంబుగద పాత్రులు, మిత్రులు లేనివారికిన్"
"గుణగణము గల్గుచో కులగణన మేల ?

అద్వైతసిద్ధికి తార్కాణముగా నీయబడిన యుపమానము "చేతినిఁ దనంత తలగడఁ జేసికొనగఁ దిమ్మ రెత్తిన నేరితో దొమ్ములాడు" లోకముయొక్క నిందాస్తుతులందు సమత్వభావమును సూచించును. విశ్వేశ్వరుని పాదసన్నిధిని, కన్యాకుమారీ, కనకదుర్గాంబల యెదుటను ఆత్మారాముడు చేసిన స్తోత్రము మకుటము లేని శతకపు పోకడ యని స్ఫురింపక పోదు. దుర్వినీతుడగు కుమారుని సత్పథానువర్తనునిగా జేయుటకు తండ్రి గావించిన బోధ యహింసామార్గము, శ్రీ గాంధీతత్త్వము స్ఫురింపజెడిని. నీ వంకరనడతను నీవే త్రవిపిడి చెప్పిన, భావము పరిశుద్ధమై ప్రభావము గలుగున్" గ్రంథము యొక్క చివరిభాగమున బిల్వమంగళునిచరిత్రము ననుకరించిన పోలికలు గన్పట్టును. భర్తకు మమతగావించిన ధర్మబోధ మెంతయు స్తుతిపాత్రము.

---

# తొలిపలుకు

గురుభక్తి యను నామాంతరము గల యీ కావ్య మపరవాల్మీకి యని ప్రసిద్ధిఁ గాంచిన శ్రీ గోస్వామి తులసీ దాసుని చరిత్రోత్తరఖండము. ఈ కావ్యముయొక్క ప్రథమ భాగము 1938 సంవత్సరమున, ప్రచురించితిని. ఈ యుత్తర ఖండముగూడ నా వెంటనే ప్రచురించుటకు బ్రయత్నించితిని గాని, కావ్యరచనకుగాని, ప్రచురణమునకుగాని తగినంత సావ కాశము కలుగఁజేయని న్యాయవాది వృత్తియందు నిమగ్నుఁడనై యుండుటచే నింత యాలస్యమైనది.

నేను విద్వాంసుఁడనుగాను. కవీశ్వరుఁడ నను నహంకారము నాకులేదు. "విబుధవరుల వలన విన్నంత కన్నంత, తెలియవచ్చినంత" యీ కావ్యమునందు పొందుపరచితిని. ఈ కావ్య ప్రథమ భాగమందు పీఠికలో నిట్లు వ్రాసితిని.

గీ. ఆయవారంబునను జీవయాత్ర గడపు
హరుఁడుఁబార్వతి వరియించినటులు, సాధు
జనుల పంచల విజ్ఞాన శకలములను
ఏఱుకొను వాని నన్ వరియించెఁ గవిత.

గుర్వనుగ్రహమువలనను, విబుధ సాహచర్యమువలనను, అనేక విషయములు గ్రహించుటకు నా కవకాశము కలిగినది. అట్టివిషయములను నా మోపినట్టు లీ కావ్యమున బొదివితిని. కావ్యమందలి గుణదోషముల నిర్ణయించుటకు సహృదయులగు విద్వాంసులే సమర్థులు.

నాయందుగల వాత్సల్యముచే నీ కావ్యమును దిలకించి తమ యామోదమును దెలియజేసి నన్నాశీర్వదించిన విద్వత్కవి శేఖరులగు బ్ర. శ్రీ. కళాప్రపూర్ణ మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారికిని, బ్ర. శ్రీ. కళాప్రపూర్ణ, కింకవీంద్ర ఘటాపంచానన, శతావధాని

చెళ్లపిళ్ల వేంకట శాస్త్రి గారికిని, బ్రి. శ్రీ. అభినవ తిక్కన దుర్భా సుబ్రహ్మణ్యశర్మ గారికిని వందనసహస్రము లర్పించు చున్నాను. ఈపొత్తమును విమర్శించి పీఠిక వ్రాసిన నామిత్రులు కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, యం.ఏ. గారికి నే నెంతయు కృతజ్ఞుడను.

ఈ కావ్యముద్రణమందు కడు జాగరూకులై యుండి సాధ్యమైనంతవఱకు ముద్రణ స్ఖాలిత్యముల దొరలనీయకుండ నచిరకాలమున ముద్రణము పూర్తిచేయించిన, రసతరంగిణీ ముద్రణాలయ కార్యనిర్వాహకులు శ్రీ విశ్వనాథ వేంకటే శ్వరులు గారెంతయు సంస్తవనీయులు.

గ్రంథప్రచురణ సందర్భమున గలుగు ప్రస్తుత ప్రభుత్వ నిర్బంధములకు లోబడి యీ నాకావ్యమును తమ గ్రంథ మాలలో ప్రచరించుట కవకాశము కలుగజేసిన రసతరంగిణీ గ్రంథమండలివారికిని నే నెంతయు కృతజ్ఞుఁడను.

లక్ష్మీపుత్రుడును, దానవీరుఁడు నగు నామిత్రుడు చుండూరు వెంకటరెడ్డి శ్రేష్ఠిగారు, లక్షల విలువగల యంత్ర శాలల ననేక ధర్మకార్యముల కొఱకై దానశాసనమును వ్రాసి "శ్రీ చుండూరు వెంకటరెడ్డి ఛారిటీస్" అను సంస్థను కల్పించెను. అనుకరణము పరిహాసభాజనమే కాని మిత్రుని దాన వీరత్వము నన్నుఁ బ్రోత్సహించి నందున చంద్రున కొకనూలు పోగన్నట్లు నే నీ కావ్యమును ముద్రించి యిందలి సర్వస్వామ్య ములు "శ్రీ చుండూరు వెంకటరెడ్డి ఛారిటీస్" అను ధర్మ సంస్థకు సమర్పించితిని.

శ్రీనివాసము,
గోవిందరాజులపేట,
బెజవాడ, 2-8-45.

ఇట్లు,
బుధజనవిధేయుఁడు,
దంటు శ్రీనివాసశర్మ

# సమీక్ష

## బ్ర॥ శ్రీ॥ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు

శ్రీ దంటు శ్రీనివాసకవిది పండితవంశము. వీరితండ్రి గారు ప్రాతస్స్మరణీయులు – శ్రీ వెంకటప్పయ్యాశాస్త్రిగారు. వీరు ఆంధ్రగీర్వాణభాషాకోవిదులు. వీరికి సంస్కృతమున అనర్ఘరాఘవమును, తెలుఁగున ఆముక్తమాల్యదయు అభిమానగ్రంథము లగుటచే విద్యార్థులు వీరికడ ఆ రెండుగ్రంథములును ఆమూలాగ్రము చదివికొనిపోయెడివారు. దానఁజేసి వీరి కీప్రాంతమున సాహిత్యచక్రవర్తి యని వ్యవహారము. ఇంతియకాక వీరు వేదాంతదర్శనమును శాంతిచేసినవారు. యతులను పూజించుట వీరి కిష్టము.

వీరి వాక్చాతుర్య మనుభోగ్యము. హాస్యరసమును వర్ణించుటలో వీ రద్వితీయులు. వీరి జ్యేష్ఠపుత్రులు శ్రీ సుబ్బావధానిగారికి వీరిలో ఏ శతాంశమో సంక్రమించిన దని నే ననుకొను చుందును. జార్జిచక్రవర్తి పట్టాభిషేకమున నూజివీటి ప్రభువులు నాచేఁ జేయించిన అవధానసభలో నెవరో యొకరు వీరిని వర్ణింపఁగోరఁగా:—

గీ. వరదరాజాప్పరాయభూవరుని మంత్రి
సంగతచమత్క్రియా రామలింగమంత్రి
అంత మాత్రంబె వెంకటప్పయ్య మంత్రి
సరససాహిత్యసామ్రాజ్య చక్రవర్తి.

అని చెప్పియుంటిని.

వీరు నూజివీటి ప్రభువులలో నొకరైన శ్రీ వరదరా జాప్పారావుగారికి చాలఁ గాలము మంత్రిగా నుండిరి. వీరికి చతురంగఖేలనమున పెద్దప్రజ్ఞ. ఇట్టి లౌకికసంపత్తియు, జ్ఞాన సంపత్తియుఁ గల శ్రీ వెంకటప్పయ్యశాస్త్రిగారి ప్రతిభా విశేషములు వీరి ముప్పురు కుమారులకును సంక్రమించి వికసించినవి. వారిలో మూఁడవవారు ప్రకృత గ్రంథకర్తలు శ్రీనివాస కవిగారు.

వీరు అటు 'లా' ప్యాసు చేసి ప్రకృతము బెజవాడలో దొడ్డవకీలుగా నున్నారు, ఇటు అమృతానందనాథుని శిష్యులై తత్త్వ మెఱిగి వారికటాక్షమున కవు లయినారు. వీరు తమకు గల గురుభక్తికి స్ఫోరకముగా ఈ గురుభక్తిని రచించియుందు రని నేను భావించుచున్నాను. వీరు తమ కుమారులలో నొకరికి తులసీదాసని నామకరణము చేయుటఁబట్టి గురుభక్తి ప్రపూర్ణుఁ డయిన తులసీదాసునందు వీరికిఁ గల గౌరవ మెవరికిని అంతగా వెల్లడింపఁ బనియుండదు. ఇట్టి శ్రీ శ్రీనివాస కవి రచించిన.

## గు రు భ క్తి

అను నీ గ్రంథము ఎఱ్ఱాప్రగడ నృసింహ పురాణమునఁ జెప్పినటులు విజ్ఞానాత్మకవాఙ్మయమునకుఁ జెందినది. ఇది అసలు తులసీదాసచరిత్ర మయినను,

'తద్విజ్ఞానార్థం గురు మే వాభిగచ్ఛేత్'

ముండక ౧-౨-౧౨

[తా నెంతఁ జదివికొన్నను స్వతంత్రించి ఆత్మ నెఱుఁగఁ జాలఁడు గనుక] 'ఎఱుకకు గురువునే సేవింప వలయును' అని

యుండుట బట్టి తులసీదాసునకును, కవికిని గల గొప్ప గురు భక్తి కారణముగా 'గురుభక్తిగా' వెలసెను.

## తు ల సీ దా సు

తులసీదాసుఁడు కామదాసుఁడు. అతనియెడ నతని భార్యకే ఏవము కలిగెను. గురుపాదమే నీకు శరణ్యమని ఆమె అతనికి బోధించెను. అతఁడడవులఁ బట్టి రాముని కబ్రహ్మాణ్యము వెట్టి అలసి సొలయఁగా తండ్రి కలలోఁ గానిపించి 'కాశిలో ఆంజనేయుఁడొక వృద్ధబ్రాహ్మణ రూపమున రామాయణము వినుచుండును. నీ వతని నాశ్రయింపుము' అని చెప్పెను. అంతట నతఁడు కాశి కేఁగి పండ్రెండేండ్లు అన్వేషింపఁగా, నన్వేషింపగా ఆంజనేయుఁడు కానిపించును. అతఁడంత నతని పాదము గట్టిగాఁ బట్టుకొనును.

'తస్మై స విద్వా నుపసన్నాయ సమ్యక్
ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ'

ముం. ౧-౨-౧౩.

'గురు విటులు తనకడకు వచ్చిన శాంతచిత్తునకు, శమాన్వితునకుఁ దత్త్వ ముపదేశించి తీరునది' అని అన్నటులు తులసీదాసుఁడు కామదాసుఁడు కాన అధికారి యగునా కాదా యని ఆంజనేయుఁడొక మాయాసుందరిని సృజించి పరీక్షించును. ఆ పరీక్షలో తులసీదాసు నెగ్గియు

'......పరీక్ష యొనర్చినఁ దాళ నేమొ'

ఈ। కామిని సోఁకినంతఁ దొలఁగంగ నశక్తుఁడ నైతి నీ విటఁ
మామక చిత్తశుద్ధి కనుమానముఁ జెంది పరీక్షసేయ నీ
బూమియుఁ బన్ని తేమొ'

అని సవినయముగ శరణాగతిచెందును. అపు డాంజనేయులు తన కాఠిన్యమునకు

సీ. క్షత్త్రియాధ్ధత్యంబుఁ గడ తేరఁగా! జోలెఁ
గట్టించెఁగద మాధుకరముకొఱకు
సామ్రాజ్యగర్వంబు శమియింప జూదమం
దెల్లసంపద హరియించెఁ గాదె
మేటిమగఁడ నన్న మిట్టిపా టడఁగద్రో
వది కట్టి యవమతిఁ బన్నెఁగాదె
పౌరుషస్మయ మెల్ల వమ్ముగా గాజులు
పెట్టించి పేడి గావించెఁ గాదె
పార్థసారథి బ్రహ్మతత్త్వంబుఁ దెలుప
విజయు నంతటి వాని నివ్విధిని శిక్ష
సేసి శోధించె నౌఁగదా శిష్యు నెడల
బంధుమర్యాద లెంతురే బ్రహ్మవిదులు. (౬౯ పుట)

అని దృష్టాంతము చూపి 'బంధము లేదు, మోక్షమును లేదు, జగమంతయు విష్ణుసంబంధము, ద్వంద్వము లాటు పోటులు, సాక్షి యటు లూరక కనుచుంటయే సిద్ధి అని తత్త్వము మహాఁడుమాటలలో తావటముచేసి తారక ముప దేశించును.

## భా వ న

మొన్న నీ నడుమ సిమ్లాసభ భగ్న మయినపుడు ఒక అమెరికా వాస్తవ్యుఁడు—'కొల్లాయ కట్టు ననియు, తులసీదాస రామాయణమును పఠించు ఛాందసుఁ డనియు, గాంగిజీని

తెగడి తన అపూర్వము తులసీదాసుకవిత్వము వలెను పోషి
గించెను. పాపము శాంతించుఁగాక!

'రష్యాదేశస్థుఁ డొకఁడు ఇప్పుడు తులసీదాసరామా
యణమును తన భాషలోని కనువదించె' నని అనుపదమే పత్రిక
లలోఁ జదివియుంటిమి. ఇంతకుముందే తులసీదాస రామా
యణానువాదముచే పెక్కుభాషలు గౌరవము సంపాదించు
కొన్నవి.

భారతీయులకును విశేషించి శ్రోత్రియులకును తులసీ
దాసు అపరవాల్మీకి యని భావన.

ఈ భావనను మన శ్రీనివాస కవి

భా వ నా స త్య ము గా

మార్చివేసెను. 'దారులు కొట్టికొట్టి (25 పు) అని ప్రారం
భించి 'నిన్నుం దిట్టను నీదు భక్తవరులకుఁ నిందింప హింసింప'
(25 పు) నని వాల్మీకిత్వమును వ్యక్తీకరించి 'గాయత్ర్యర్థ
మూహింపుమా' (70 పు) అని ఆంజనేయునిచే ననిపించి పిమ్మట
శ్రీరామసాక్షాత్కారమునఁ జెప్పిన ఇరువదినాలుగు పద్య
ముల మొదల గాయత్రీమంత్రన్యాసము చేసి

'ఈతని పూర్వవృత్తము మహీతనయావర! చిత్తగింపు ప్రా
చేతసుఁ డీతఁడు' (164 పు)

అని ఆంజనేయునిచేఁ దెలిపి పిమ్మట శ్రీరామునిచే
'ఇరువదినాల్గువేల రచియించిన యర్థము నెల్ల నేర్పుమై
ఇరువదినాల్గు పద్యముల హృద్యముగా రచియించితో ముని

శ్వర! భవదీయ చాతురియు భక్తియు లోక మెఱుంగఁగా సవి స్తరముగ నస్మదీయ చరితంబును బ్రాకృతభాషఁ గూర్చుమీ?
(165 పు)

అని పలికించి తులసీదాసును మన కనులయెదుట వాల్మీకిగా నిలువఁబెట్టుట హృదయంగమము. మఱియు నీ కవి తత్త్వస్తంభముమీఁద తంత్రోపాసనమునకును, సగుణోపాసన మునకును సమానప్రతిష్ఠ కల్పించియు, భగవదిచ్ఛాదర్పణము పై భవమునకును, ముక్తికిని సమాన ప్రతిబింబములను జూపియు, వాణి వీణపై భక్తిని నిర్వేదమును ఏకస్థాయిలో పలికించియు అపూర్వమైన సామ్యమును నిలుపుట శాస్త్ర మెఱిఁగిన వారికిని, కవిత్వ మెఱిఁగిన వారికిని అబ్బురము గొలుపక మానదు.

## మమత

మగనిఁ బడఁదిట్టి తిన్నాళ్ళతిప్పలు పట్టించితి నని అను కొని తన నింత తిట్టుకొన్నది; కాశిమెట్టినది. అతనిఁ గనుఁగొన స్తోత్రము పెట్టినది. అనుకొన్నట్లే అతని దర్శన మైనదికాని యామె గుర్తింపలేదు. తులసీదాసు మాత్రము గుర్తింపఁ గలి గెను. 'వలచుట దోషమెట్లనను పట్టును దప్పె'' అని అతఁ డాస్త్రమున సాక్షిమాత్రుఁడుగా నుండెను. మమతకు మమత హెచ్చెను. అపుడు కపట బ్రాహ్మణు డొకఁ డామెకడకువచ్చి 'భర్తృస్నేహము హేయ'మనియు 'విరక్తుఁడయిన మగనిని మరల సముద్రములోఁ ద్రోయకు'మనియుఁ జెప్పెను. అంత నాయమ 'సతికి' బతికన్న వేరగతి లేదనియు, 'ఆడుదానికి' పాతివ్రత్యముకన్న వేరే నియమములును, నిష్ఠలును లేవనియు

జంబూద్వీపంబున జన్మముం గనిన పూర్వంబోడి యాత్మేశు
పాద ద్వంద్వమ్మును నాలయ బు మదిలో ధ్యానించు సేవించు
ననియును, అతనిని ప్రత్యాఖ్యానించును. అంత నతఁడు తులసీ
దాసును సమీపించును. అతఁడు 'నీ కేమి వలయునో కోరు
కొనుము, ఇత్తును' అని యనును. అతఁడు అయ్యా! విశ్వ
జిద్యాగముచేసినవారి వంశమునబుట్టినవాఁడు రాముఁడు, అతని
భక్తుఁడవు నీవు. అట్టి నీ వీయలేని దొకటి యుండునా? ఐనను
చూచెదను. నాకు మమతనిమ్ము అని యడుగును. తులసీదాసు
"ఆహా ప్రొద్దు పడమర తిరిగినది. ఈ వయసులో భార్యయే
శత్రువుకదా! అట్టియెడ నీకు పరవనితవలయునా? అని నిషేధిం
చును బ్రాహ్మణుఁడు 'అయ్యా మన్మథుఁడుదుర్జయుఁడు యౌవన
ఉదయ-అంతములందు కామము హెచ్చు. ఋతువు మొదట
వచ్చెనని ఉబ్బుచేతను, ఋతువుచివర తగ్గునను తబ్బిబ్బుచేతను
పండ్లయెడల మనకు వాంఛ అధికము. కావున నీవు నాకోర్కి-
నంగీకరింపుమని అనును. తులసీదాసు మమతను జూచి మమత
విడచి ఇతని దనియింపు మని యనును. ఆమె ఇదికూడ దని
మానభిక్ష వేడును. అంత నాబ్రాహ్మణుఁడు "నేను మహాపతి
వ్రత నను నహంకారమే నీకుఁ గాని నీవు నీ పతియాజ్ఞ
దాఁటు టెఱుఁగవు, పతిమాట లెక్కలేనిదానికి పాతివ్రత్య
మేమి?" అని తులసీదాసును జూచి 'ఓయీ! నీవే న్యాయము
చెప్పుము' అని యనును. తులసీదాసు బ్రాహ్మణుని పక్షమే
పలుకును. ఆమె యిటులు అగ్నికుండమున నుఱుకుచుండఁగా
పాఠకులకు దుఃఖమువలన బాష్పము లూరును. అంతట నా
బ్రాహ్మణుఁ డంతర్హితుఁడగుటయు, భగవానుఁడు ప్రత్యక్షము

సేయుటయు మన దుఃఖబాష్పము లానందబాష్పములుగా మాఱుటయు, ఏకకాలమున తటస్థించును. ఇటులు మమతను చిత్రించి కవి తనకుఁ గల లోకజ్ఞతను విస్తారముగా వెల్లడించినాఁడు. పెద్ద లాయరుకదా!

సు శీ లుఁ డు

ఇతఁడు కాశిలో తులసీదాసునకు తండ్రిసంగతి తెలిపి ఆంజనేయుని జూచుటకు తోడై నడచిన మిత్రుఁడు. కవి మమతా తులసీదాసులను చిత్రించుటలో నిమగ్నుఁ డగుట చేతనో లేక?

'దూడల తర। మా దంటులు గొఱక'

వరాహ ౭-౨౧

అని అన్నట్లు తన కధికారము లేకయో మఱి కనఁబడఁడు.

ప రీ క్ష

శ్రీ చైతన్యు లిరువదేండ్లలోపు ఈఁమన సన్యసింపఁగోరి గురువుకడకు వెళ్ళఁగా నతఁడు చూచి 'ఓయీ! ఇంత అంద గాఁడవు, సుకుమారుఁడవు, పైఁగా లేఁ బ్రాయమువాఁడవు, నీ కేమిటి? సన్యాసమేమిటి? అని పలికి మరల ఐనను చూతము ఏదీ నాలుక చూపుము అని అతఁడు చాఁపిన నాలుకమీఁద పంచదార వైచెనఁట. పంచదార ఎంతసేపటికిని కరఁగక యటులనే యుండు నంతట సుడిగాలి రాఁగాఆ పంచదార పలుకు లన్నియుఁ గొట్టుకొని పోయెనఁట. అపుడు ఆ గురు దేవుఁడు సంతసించి

'జిహాస్వోపస్థా పరిత్యాగే పృథివ్యాం కిం ప్రయోజనమ్?'

అని చైతన్యులకు సన్న్యాస మిచ్చిరఁట. 'పరీక్ష యనిన నీ రీతిగా నుండవలయును గాని ఆంజనేయుఁ డేమిఁటి, ఈపరీక్ష యేమిటి? ఆటామిక్ బాంబా?' అని ఎవరేని శంకింపవచ్చును. ఇచట కోరిక క్రియాపర్యవసాయి కాదు. ఆ కోరికయు మిథ్య. ఆ బ్రాహ్మణుఁడును మిథ్య. ఈ బాంబు 'ఠే' వని మండదు. 'ఢా' మ్మని మాత్రము మ్రోగును.

ఇచట కొందఱు కామగ్రంథిని భేదించుట కింతకంటె తక్కువ చేదయిన మందింకొకటి లేదని కవితో నేకీభవింప వచ్చును. మఱి కొందఱేకీభవింపక పోవచ్చును. కవితో నేకీభవించువారు

'తస్మై మృదిత కషాయాయ'

అను నుపనిషత్తును

'జిహ్వోపస్థా పరిత్యాగే'

అను స్మృతిని మఱికొన్ని భక్తితత్త్వ గ్రంథము లందలి కథల నుదాహరింతురు. ఏకీభవింపనివారు

'అన్యథా వా ప్రకల్పయేత్'

అని మఱొక మధుకాపథమును వెదుకుదురు. ఇది రుచి భేదము.

కాయకన్న తొడిమ మిన్న

ఉపేయమైన తత్త్వమును చాలన చేయుటకు బదులు ఉపాయమైన గురువునే ఈ గ్రంథ మెక్కుడు చాలన చేయుచున్న

దేమి ? అని యెవరే ననవచ్చును నిక్కమే. ఇం దపాయ మేమియు లేదు. గురువు లేక యెఱుక లేదు గాన కవి యిందు తద్భక్తికే ప్రాముఖ్య మిచ్చెను. మఱియు మారుతి యెట్ట యెదుటనే యున్నను తులసీదాసుచే శ్రీరాముని నుతింపఁ జేయుచు

.......................................ఆత్మీయమా
సామర్థ్యం బెఱుఁగండు ఋక్షపతి యాశాసించునందాఁక నో
స్వామీ! మారుతి స్వస్వరూప మలయాచార్యుండె తెల్పుంగదా
(195 పు)

అని అనిపించును. సమయము వచ్చినపు డెల్ల నీ కవి గురువు నుద్ఘోషించును. అట నీ కవికి పునరుక్తి లేదు. అసలీ గ్రంథము గురుభక్తి అటులయినను ఈ గురుభక్తి యంతయు పైనున్న తత్త్వ ప్రవాహములో కలిసిపోవునే కాని యమున వలె విడిగా తన అస్తిత్వము నెంతమాత్రమును ఉంచుకొనదు.

## న వ్య మ త ము

అక్బరు తులసీదాసు ప్రతిభ విని అతని సమీపించి 'అయ్యా! నేను సర్వమతసారసంగ్రహము చేసి నవ్యమత మొకటి నెలకొల్పఁదలఁచుకొంటి నని నీ వెఱుగుదువు. అందుల కిపుడు నీసాయ మక్కఱయై యున్న దని యడుగఁగా తులసీ దాసుచే.

'క. పలువిధములైన మతములఁ
గలసారము నేర్చికూర్పఁగా సంకరమై

దేమి ? అని యెవరే ననవచ్చును నిక్కమే. ఇందపాయ మేమియు లేదు. గురువు లేక యెఱుక లేదు గాన కవి యిందు తద్భక్తికే ప్రాముఖ్య మిచ్చెను. మఱియు మారుతి యెట్ట యెదుటనే యున్నను తులసీదాసుచే శ్రీరాముని నుతింపఁ జేయుచు

......................................ఆత్మీయమౌ
సామర్థ్యం బెఱుఁగండు ఋక్షపతి యాశాసించునందాఁక నో
స్వామీ! మారుతి స్వస్వరూప మలయాచార్యుండె తెల్పుంగదా
(195 పు)

అని అనిపించును. సమయము వచ్చినపు డెల్ల నీ కవి గురువు నుద్ఘోషించును. అట నీ కవికి పునరుక్తి లేదు. అసలీ గ్రంథము గురుభక్తి అటులయినను ఈ గురుభక్తి యంతయు పైనున్న తత్త్వ ప్రవాహములో కలిసిపోవునే కాని యమున వలె విడిగా తన అస్తిత్వము నెంతమాత్రమును ఉంచుకొనదు.

## నవ్యమతము

అక్బరు తులసీదాసు ప్రతిభ విని అతని సమీపించి 'అయ్యా! నేను సర్వమతసారసంగ్రహము చేసి నవ్యమత మొకటి నెలకొల్పఁదలఁచుకొంటి నని నీ వెఱుఁగుదువు. అందుల కిపుడు నీసాయ మక్కఱయై యున్నదని యడుగఁగా తులసీదాసుచే.

'క. పలువిధములైన మతములఁ
గలసారము నేర్చికూర్పఁగా సంకరమై

గీ. శ్రీసదాశివు లింగాభిషేక మొకో-
శ్రీనివాసుని పవళింపు సేవయొకో-
వరదరాజుల గరుడసేవయొ మహాత్మ!
సాటివానినిఁ గొల్వ మోక్షంబు కలదె. (123 పుట.)

ఇట్టి పద్యము లీ గ్రంథమునం దెన్నియో కలవు.

ఈ కవికిఁగల తంత్రపరిచయము నీ దిగువపద్యమునఁ గనుపట్టును:—

క. చాలఁగ విషయసుఖమ్ములఁ
గ్రోలితి దేవా ఋజీషరోమంథం బిం
కేలా? (57 పు.)

ఋజీషమనఁగా 'పిండి వండుపాత్ర' అని అమరుఁడు, పిప్పి అని యజుర్వేద భాష్యమున సాయణుఁడు చెఱకు పిప్పి యని తంత్రాచార్యులు. 'ఈఁ'యను శంకరీబీజముతో ఈఁయని కూపెట్టుటను మేళన మొనర్చె.

సమయాచార మెఱుంగఁ గౌళమతమున్ సాధింపఁగాఁజాలయో
గము నభ్యాసము సేయనోపఁ గ్రతుదీక్షల్ పూనఁగా నేర వే
దము వల్లింప నశక్తుఁడన్ వివిధశాస్త్రప్రక్రియల్ నేర్వ నో
హిమశైలేంద్రసుతా! నిరంతరము 'ఈఁఈఁ' యంచుఁగూపెట్టెదన్

అని యీకవి తనతంత్రజ్ఞతకు భావనాబలమును తోడు చేయుట సహృదయైకగమ్యము. అక్షరమాలాస్తోత్రము తెలుఁగు ప్రబంధముల కరిది. పద్యాదిని అక్షరముల నన్నిటిని గూర్పవలసిన నియమమును, గాయత్రీమంత్రమును గూర్ప

వలసిన నియమమును బెట్టుకొని కొన్ని అక్షరముల యెడ పాఫ మీాకవి చాలఁ జిక్కు-నఁ బడ్డాఁడు. కవియే ముక్కుద్రాఁడు బోసికొనెను; మన మేమి చేయఁగలము?

ఈ కవికి వ్యాకరణమునందు కాంక్ష యెక్కు-డనుటకు క్రిందిపద్య ముదాహరింతును.

ఉ. ణిచ్చుల శబ్దశాస్త్ర విధి నిర్ణయరీతిని బ్రేరణార్థమై
వచ్చిన రూపమే పగిది వర్తిలు స్వార్థమునందు నట్టులే
చొచ్చి మనంబులోపలఁ బ్రచోదనచేయఁగ చేయఁగర్మముల్
నిచ్చ ద్విధా ప్రవర్తిలుదు నీ వొకరుండవె జానకీపతీ!
(౧౫౭ పు.)

భక్తి తన్మయతకు చెప్పఁదగిన చాల బద్యములలో

గీ. ఉవిద చక్రాంతి బంధమై యుండె నేమి
దాశరథి దివ్యపాదపద్మములు దాల్చెఁ
జపల చిత్తమ! నీకు లజ్జయును లేదె
యరయ నీకన్నఁ బాషాణమైన మేలు

చ. డమరువుపాటి చేయదె మృడాని భవత్పదభక్తుగాత్ర మా
ప్రమథగణాధినాధునకు వాద్యవిశేషముగాఁగ దీని నీ
వమరిచి తన్మఖమ్మున సమంచితరీతిని శబ్దజాలముం
దెమలుపుమమ్మమిమ్ముమ్మవినుతించెద నెప్పుడు వేయినోళ్లతోన్
(100 పు)

చ. దమముశమంబు లేకదశధా భ్రమమాణ మదిఁద్రియాళివల్లీ
భ్రమణమునాఁగి నిన్నుఁగొలువంగనశక్తుఁడనెందునెందు జి

త్రము ప్రసరించు నాకచటద్వచ్ఛభరూపము నెందునేమదీ
యము శిరముందు నందు భవదంఘ్రియుగమ్మును జూపు
మమ్మరో. (102 పు)

ఈ మొ॥ పద్యములు హృదయమును ద్రవింపఁజేయుచున్నవి.

నిగమనము

శా. * దాగ్రోద్దీరిత సత్ప్రథుండు తులసీదాసుం డిటన్ నేత శాం
తారూఢిన్ గురుభక్తి దేవరతి ముఖ్యంబౌఁ, దదుద్దీప్తికిన్
వైరాగ్యంబును దీర్ఘసేవ జప సంవాదోపదేశాద్భుతా
కారాచార్య పరీక్ష లాహితము లీ కబ్బంబునం దోబుధుల్.

ఈ గ్రంథమునఁ గల విషయములు గహనములు. వానికి నే నపచారము చేసియుంటినేని ప్రాజ్ఞుల క్షమయే నా యజ్ఞానమున కాచ్ఛాదకము.

---

* బ్రి॥ శ్రీ॥ శతావధాని వేలూరి శివరామ శాస్త్రిగారు కీ॥ శే॥ మా యన్నగారైన సుబ్బావధానిగారికి బాల్యమిత్రులు. నాకన్న వరుస వారు, నా యందలి వాత్సల్యముచే శివరామశాస్త్రిగారున్నూ నన్నాశీర్వదించిన తదితరులును దోషజ్ఞ శేఖరు లయ్యును నా కావ్యమందు గుణలేశము లనే ఎన్నిరి కాని దోసగుల నెన్నరైరి. వారందఱకు నేను కృతజ్ఞుడను.

"త్వచ్ఛిద్విలా। సావాప్తం బది కాదొకో తలప విద్యా విద్యరూపా! పరా॥"
(పుట 107)

విద్యావిద్యరూపా అను టొప్పుదని శ్రీ శివరామశాస్త్రిగారు నా కంతరంగమున దెలియ జేసిరి. కాన నా పాదము నిట్లు సవరించితిని.

"త్వచ్ఛిద్విలా। సావాప్తంబది కాదొకో యగజ!విద్యావిద్యలీ వాటచేన్"

ఇంక చిట్టి ప్రమాదము లుండవచ్చును ఈ గ్రంథమునకు పునర్ముద్రణావసరము గలుగు పున్నెమబ్బిన సవరించుకొందుము.

కృతికర్త.

# శ్రీతిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహావిద్యాపీఠమ్

బక్కింగుహాంపేట, బెజవాడ.

శ్రీమతి కవితిలక, కవితావిశారద, విద్వాన్

## కాంచనపల్లి కనకమ్మగారు రచించిన పద్యగ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ జీవయాత్ర | రు 2-8-0 |
| 2. | హంసవిజయము | 1-8-0 |
| 3. | అమృత సారము | 1-0-0 |
| 4. | ఆనందసారము | 1-0-0 |
| 5. | శ్రీ మద్రామాయణ కథా సంగ్రహము | 0-6-0 |
| 6. | ఆంధ్రాభిజ్ఞాన శాకుంతలము | 1-12-0 |
| 7. | తోమాలియ - ఇది కవయిత్రి యా యా సందర్భములలోఁ జెప్పిన పద్యకుసుమముల సముదాయము - ప్రస్తావోచితము | 1-12-0 |
| 8. | రాధ - (నవల) | 1-0-0 |



వైద్యరాజ పండితరాజ డాక్టర్

## దంటు సుబ్బావధానిగారి గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | ఆంధ్ర భామినీ విలాసము | రు 1-4-0 |
| 2. | అమృత సందేశము | 0-8-0 |

సంస్కృత శ్లోకములు - ఆంధ్రానువాదసహితము

3. అమృతలహరి - మూలము 0-8-0

వ్యాఖ్యానము, సంస్కృతము

 ఈ గ్రంథము లన్నియు వెంకటరామ్ అండ్కో బుక్ సెల్లర్సు వద్ద కూడా దొరకును.

★

దంటు శ్రీనివాసశర్మ బి. ఏ., బి. యల్. గారి గ్రంథములు.

1. తులసీదాస చరిత్రము, ప్రథమభాగము రు 1-12-0

2. "గురుభక్తి" (అను నామాంతరముగల తులసీదాస చరిత్రోత్తర ఖండము) రు 2-8-0

ఈ రెండుగ్రంథములు ఒకేపర్యాయము గావలయువారికి 4-0-0

3. మీరాబాయి చరిత్రము, అచ్చులోనున్నది.



శ్రీ భాస్యాయనమః

# గురుభక్తి

## ప్రథమాశ్వాసము

(శ్రీగోస్వామి తులసీదాసచరిత్రోత్తర ఖండము)

శ్రీ శేషాచలవాసున్
రాశీభూతాజహరిహరమహాతేజో
వేషున్ భక్తత్రాణా
వేషున్ శ్రీవేంకటేశు విభు భజియింతున్.

జాగరసుషుప్తులను నిజసవ్యావామ
భాగములు, జఘనము స్వప్నభావమునను
తుర్య తదతీతముల ముఖోత్ఫుల్లహృదయ
ములును క్లృప్తములౌ దేవి లలితఁ గొలుతు.

స్పర్శముల జాగరంబును స్వరచయమున
సుప్తి, సంతస్థముల స్వప్నక్లృప్తి, సూక్ష్మ
విసరమున యోగనిద్ర రూపించి తెలుపు
మంత్రజనని భజింతును మానసమున.

సీ. ఛందస్సులు పదారవిందముల్ గాఁగ ని
రుక్తంబు నఖములయొప్పుఁ గూర్ప
జంఘల సొబఁగు శిక్షాదర్శనము దీర్ప
ఋగ్వేద మూరుద్వయి నెనయంగ
సొంపౌ జఘనము యజుర్వేదమై మించ
నుదరంబు సామమై యొప్పు మిగుల
నమృతలోచనము లయ్యామ్నాయశిఖలుగాఁ
గావ్యంబు లానన కాంతిఁ జిమ్మ

గీ. తర్కశాస్త్రము కర్కశ స్తనయుగళము
స్మృతులు శ్రోత్రేంద్రియములునై యింపులీన
వెలయు సర్వాంగసుందరి పలుకువెలఁది
లాస్య మొనరించుఁగాక మదాస్యసీమ.

క. లంబోదరు మూలాధా
రాంబుజసంస్థాను మూషకారూఢుని హే
రంబు గజాననుఁ బ్రత్యూ
హాంబుదఝంఝాప్రభంజనాభుఁ దలంతున్.

మ. తమపేర్మిం దెలియంగనీక ఫలసం
తానంబుఁ గల్గించు కృ
త్యమునుం దీరిచి రాలిపోవు సుమజా
తం బట్లు, గూఢుండు, ని

ర్మముఖుం, గీర్తిపరాజ్ముఖుండు నయి ఛా
త్రవ్రాతముం దిద్ది యు
త్తములం జేసి పరోక్షమైన యమృతున్
ధ్యానింతు నస్మద్గురున్.

మ. గుహా నేకాంతమునందు శంకరునకున్
గోవిందయోగీంద్రుఁ డ
న్వహామున్ యోగమ ? మంత్రమా ?
నిగమమా ? న్యాయంబ ? వేదాంతమా ?
గహనార్థంబు లిఁకేమి తెల్పెనని యా
కాంక్షింపనేలా ? యను
గ్రహవైశిష్ట్యము ఛాత్రసత్కృతులలోఁ
గాన్పింపదే తెల్లమై.

ఉ. శక్తులఁ జూపెనే వివిధశాస్త్రచయంబును నేర్పగల్గెనే
ప్రాక్తనవిద్య లన్నిటను బ్రౌఢి గడించెనె భూషణుండు సు
వ్యక్తముగాకపోయెఁ దమకంచుఁ దదీయులె పల్కుచుందు రా
భక్తులు దెల్పుకున్న భగవంతు నెఱుంగుదు రెట్లు పామరుల్

సీ. తత్త్వోపదేష్టృమూర్ధన్యుండు సుమ్మని
కనకాంబకృతులు సాక్ష్యంబొసంగు
సారస్వతాధిరాజ్యప్రదుం డంచు సు
బ్బవధాని గీర్వాణకవిత దెలుపు
భక్తవర్యుల పాలి పారిజాతం బని
రెడ్డిసంపదలు గర్జించి చాటు

సిద్ధసంకల్పుఁ డాస్తికశేఖరుం డంచుఁ
ద్రైలింగ్యపీఠసంస్థయె వచించు

గీ. నార్షవిద్యాసముద్ధర్త యనుచు భరత
భూమి నెల్లెడ ఘోషించు ముదముతోడ
సర్వతంత్రస్వతంత్రవిశాలశాల
యమృతుఁ డానందనాథవిద్యాగురుండు.

గీ. కృష్ణభూషణగురు శిష్యబృందమందు
నగ్రసరులైనవారి సుబ్బావధానిఁ
బార్థసారథిఁ గన కాంబఁ బ్రథితయశుఁడు
శ్రీయుతుండైన వేంకటరెడ్డిఁ దలఁతు.

గీ. అగ్రజులు నాకు నందు సుబ్బావధాని
పార్థసారథినాఁ జను వా రిరువురు
సోదరులును సతీర్థ్యులౌ, శుభ్రకీర్తు
లను భజించెద నెప్పుడు మనమునందు.

చ. ప్రవిమలశీలుఁ డాప్తుఁ డనవద్యగుణాభరణుండు నిస్పృహుం
డవగతసర్వతంత్రనిగమాంతసమన్వయుఁ డార్తలోకబాం
ధవుఁడు భిషగ్వరుండు పరతత్త్వవిదగ్రణి పూర్ణదీక్షితుం
డెవఁ డతనిన్ భజించెద నకృత్రిమభక్తిని బార్థసారథిన్.

గీ. సరసగీర్వాణభాషావచనరచనల
ప్రౌఢుఁ డాతఁడు హ్యాణాంధ్రవాఙ్మయములఁ
దత్త్వమెఱిఁగిన విబుధుఁ డంతర్ముఖుండు
కపటరహితుఁడు హితుఁ డవికత్థనుండు

మ. సదయుం డాతఁడు నాదు మానసమునన్
సౌభాగ్యవిద్యేశ్వరీ
పదపంకేరుహయుగ్మము న్నిలిపి య
వ్యాజానురాగంబునన్
మదిఁ గాంక్షించు జపించు నిక్కముగ నా
నందించు, దీవించు న
భ్యుదయంబుల్ గలుగంగ నాకుఁ బరమా
ప్తుం డౌచు నెల్లప్పుడున్.

క. సారస్వత బీజముఁ బ్రియ
మారఁగ నా మదిని నాటి యాంధ్రకవులలో
గారవ మే యమ నాకుం
గూరిచె నా కనకమాంబఁ గూర్మి భజింతున్.

సీ. తన "జీవయాత్రా" గ్రథనమున గురుబోధ
ఝురి తటాకోదకసరణి నిలువ
కొలఁకున నలలపైఁ గులుకు హంసంబునా
"హంసజయంబు" ప్రఖ్యాతిఁ గాంచ
సరసిజమకరందసరణి "నానంద సా
రము" "సుధాసారంబుఁ" బ్రణుతికెక్కఁ
బంకేజమాలాప్రబంధబంధురమయి
మోదంబుఁ "దోమాల" బుగులుకొలుప

గీ. భక్తివైరాగ్యబోధసంభరిత కావ్య
కల్పనానల్పశేముషీకలన మెఱసి

బహుక్రతు లొనర్చి తాను సంపదల వడసి
విదుషి కనకాంబ ధరలోనఁ బెంపుఁగాంచు.

శా. జాగ్రత్ స్వప్న జపంబులందలఁచి యాశాసింతు మన్మిత్రు న
ర్థ్యగ్రామాగ్రణి, దానవీరు,గురుపాదాంభోజయుగ్మార్చనా
వ్యగ్రస్వాంతుని, గీర్తికాము, ననవద్యస్వచ్ఛచారిత్రు, నీ
లగ్రీవప్రణిధానతత్పరుని నమ్లానానురాగంబునన్.

ఉ. తారకనామకీర్తనసుధారసికాగ్రణి కార్యసన్నుతో
దారగభీరభావున కుదాత్తచరిత్రున కాత్తకీర్తివి
స్తారున కార్తదీనజనతారణశీలికి ధైర్యశాలికిన్
వీరునకున్ వణిజ్మణికి వేంకటరెడ్డికిఁ గల్గు నున్నతుల్.

ఉ. దాతలు గల్గకుంద్రె వసుధాతలమందునఁ బుణ్యకార్య సం
ధాతలు గల్గకుంద్రె యవదాతగుణోన్నతి దేశికాంఘ్రికం
జాతమరందపానరతి సత్కరుణామతి రెడ్డిసాటియా
పూతచరిత్రు లివ్విపులఁ బుట్టుదురే కలికాలమందునన్.

గీ. దాహ మవదాహమున కున్న తను భజించు
వారితాపముఁ బాపఁగ వారిద్రావుఁ
బ్రీతి ధనమందు వేంకటరెడ్డి కున్న
యర్థులకు నీయఁ జేయు నర్థార్జనంబు.

క. కలమాన్నదానకలన స
కలనిగమాగమవిదవనకలన వెలసి యా
కలిఁ బాపు రెడ్డి యదిరా!
కలవాఁడన నతఁడెసూ సకలజగమునకున్.

క. శ్రీగలవార లనేకులు
నైగమపుంగవులు లేరె నైగమవిద్యా
శ్రీ గలుగు రెడ్డి నెనయు వి
రాగులు గనరారుగాక రసఁ బరికింపన్.

ఉ. కూరిమి బిడ్డనట్లు కడుగోమునఁ బెంచిన యంత్రశాల న
వ్వారిగ దారవోసె బుధవర్యులు మెచ్చఁగ ధర్మసంస్థ కీ
వీరుఁడు భారతప్రథితభేషజతంత్రములన్ నవీనక
ర్మారకళావిలాసములఁ బ్రాక్తనవిద్యలఁ బ్రోదిసేయఁగన్.

చ. పరమమునీంద్రసేవ్యమగు బ్రహ్మకపాలమునందుఁ బుట్టి స
త్వరముగఁ గాశి మున్నగు పట్టణసీమలఁ బర్వి వింధ్యభూ
ధరము నతిక్రమించి వితతంబయి రెడ్డియశస్స్రవంతి ని
బ్బరముగఁ జేరు సేతువు నవారిగ జీవనదీప్రవాహమై.

గీ. కాళిదాసగ్రథితమగు కావ్యమనుట
దక్క నిజవంశనామగోత్రములు దేశ
కాలములఁ దెల్ప కతఁడు దిక్కాలనామ
రూపకల్పితమాయావరోధ ముడిపి
శాశ్వతుండయి వ్యాపించె విశ్వమెల్ల

సంహితాభ్యాసుఁ డుభయభాషాకవిత్వ
దక్షుఁ డవదాతచరితుండు ధర్మవిదుఁడు
భట్టు బహుయాగసత్ఫలప్రద మటంచు
భారతసముద్ర మీదఁగా వాంఛసేసె

బాదరాయణసంయమిప్రవరరచిత
భారతామ్నాయమును దెన్గుబాస నుడువు
టదియు నారాధనవిశేష మనుచుఁ దిక్క
యజ్వ వెలసెఁ గవిబ్రహ్మయగుచు ధరణి

పలుకు నాయదె పలికించువాఁడు రామ
భద్రుఁ డేఁ బల్కువాఁడను భాగవతము
భవహరంబుగ నని భక్తవరుఁడు పోత
రాజు హాటకగర్భురాణి కంటి
నీరుఁ దుడిచి భజించి నిర్నిద్రకీర్తి
నెనసి తేనెలు గురిసెను దెనుఁగు నుడుల

ఏను జెప్పెదఁ గవిత బ్రాహ్మీవరమున
రాణ బ్రహ్మాండముఖ్యపురాణనిచయ
పారగుఁడ బ్రహ్మతత్త్వవిశారదుండ
ననుచుఁ గవిసార్వభౌముఁడై తనరి యాంధ్ర
నైషధంబును బల్కె శ్రీనాథసుకవి

కవివరేణ్యులు పూర్వ లక్షణరహస్య
మెఱిఁగి కృతమతులై యహంకృతిని వదలి
కృతులఁ గృతకేతరోక్త్యనుకృతు లొనర్చి
శ్రేయమును విశ్వమునకు శ్వశ్రేయసంబుఁ
దమకు సాధించి యాచంద్రతారకముగ
స్వీయరచనల స్థిరను సుస్థిర మొనర్చి

ఋషులె యధికృతు లగుదురు కృతు లొనర్ప
ననెడు నార్యోక్తి నిజమని కనబరచిరి.

అదిర ! యీ నాటి కింకవు లదరిపడుచు
సాధువులఁ దిట్టి వేదశాస్త్రములఁ దెగడి
తామె సర్వజ్ఞుల మని యుద్ధతి నెసంగి
స్వీయదోషంబులనె కథానాయకులకుఁ
గట్టిపెట్టుచు నదె ఘనకార్య మనుచుఁ
బ్రకృతివర్ణన మని యసభ్యప్రసంగ
యుతము లౌ కృతు లయుతముల్ ప్రతిదినంబు
నాయసాక్షరముద్రణాయంత్రపటిమ
ధరణి వెదజల్లి తమ యసత్కావ్యచయము
సరవి ఛత్రాకములవోలె సుగుగు బెఱుఁగ
తెలుకలేనట్టివారికిఁ గఱపుచుంద్రు
స్వీయదుర్మతముల నుంతచింత లేక

సుగుణవతియైన కులకాంతచొప్పు మెఱసి
మంచి కావ్యము హితము బోధించు నంచుఁ
బెద్ద లన్నట్టి మాటను వృథ యొనర్చి
కులటవోలెను బైమెఱుంగులను జూపి
కుపథముల కీడ్చుచుందు నీ కుకవికృతులు

తల్లిగర్భములో నున్న తరుణమందె
హరిమయము విశ్వమంతయు ననెడిసూక్తి

నేర్చి తద్భావభావనానియతినుండి
పొగడ నొక్కని వేఱొక్క పురుషుఁ డెగడఁ
దగునె? సంపూర్ణమైన బోధంబు నీయ
నన్వయవ్యతిరేకంబు లవసరంబు
లగుటఁ బరమేశ్వరేచ్ఛనే యనుసరించి
పథము లపథంబులును బుణ్యపాపములును
జగతిఁ గల్గునటంచు నంజలి ఘటించి
సుకవిజనములతోఁ బాటు కుకవినికర
ములకు జోహారువులు సమబుద్ధి నిత్తు.

---



కృతిపతి:

(శ్రీ సచ్చిదానందనాథ దీక్షానామ విరాజితులు)

కీ॥ శే॥ వైద్యరాజ, పండితరాజ

దంటు సుబ్బావధానులుగారు

అధిపతి: శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠము.

# కృతిగ్రహీతృప్రశంస

క. శ్రీవేంకటేశ ! వరదా!
భావాతీతప్రభావ ! భక్తార్తిహరా !
కైవల్యదాననిపుణా !
దేవేంద్రప్రముఖనిఖిలదేవస్తుత్యా!

క. తులసీదాసుని చరితము
తొలి సగమును స్వీకరించి తోయజనాభా !
వెలయించితి జగమున న
వ్వలిసగ మిచ్చెదను నీదు భక్తున కెలమిన్.

క. భక్తులలో నీవుందువు
భక్తులు నీలోన నుంద్రు పరికింప భవ
చ్ఛక్తిని జాటఁగ నీవే
భక్తాకృతి నవతరింతు పద్మదళాక్షా !

క. ఈషణరహితుండై యిహ
భూషణగురుసూక్తి నిలిచి మునివై నిన్నున్,
శేషాచలమున గొలుచు మ
నీషిన్ సుబ్బావధాని నీ వెఱుఁగవొకో.

శా. నీ నామాంకితమైన పీఠ మవనిం దీపింపఁగాఁ జేసి వి
ద్యానీకంబును నీదుభక్తియును నాంధ్రక్షోణి వర్ధిల్లఁగా
నానాక్లేశము లోర్చినాఁడు గద యీనాఁ డెవ్వఁ డా రీతిగాఁ
బూనంజాలు స్వధర్మదీక్షఁ జెపుమా భోగీంద్రశైలాధిపా!

మ. అవధానంబులఁ జేయరే కవు లమే
యప్రౌఢిమం జూపి సు
బ్బవధానుల్ బలె దేశికేంద్రచరణ
ద్వంద్వంబునందే సదా
యవధానంబునఁ జిత్తము న్నిలుప సా
ధ్యంబయ్యెనే వారికిన్
గవనంబున్ గురుదేవతార్చనకు సా
న్నాయ్యంబుగాఁ జేయుచున్.

క. గుర్వీశ్వరవరివస్యా
నిర్విష్టప్రతిభ నతఁ డనిందితశైలిన్
గీర్వాణకృతు లొనర్చుచు
గీర్వాణాకృతి సుకృతి యకృతముం బడసెన్.

క. ఛత్రపతిశివి గల్గియు
సత్రాధ్వరదీక్ష సాధుసంస్తుతభిక్షా
పాత్రికఁ బూనిన సద్గురు
పుత్రున్ సుబ్బావధానిఁ బోలుదు రె యొరుల్ ?

క. శారీరశాస్త్ర మేనియు
శారీరకశాస్త్ర మేని సరసోక్తులతో

సూరిజనవినుతఫణితి న
వారిగ బోధించు విబుధవరు నెఱుఁగవో!

క. శోధించును దేహాత్మల
బోధించును బ్రహ్మతత్త్వమును శిష్యుల క
వ్యాధివ్యాధుల మాన్పు మ
హాధీమంతుండు సచ్చిదానందుఁ డిలన్.

చ. సుమధుర శైలియం దఖిల
సూరులు మెచ్చఁగ భామినీవిలా
సము రచియించి యా సుకవి
చంద్రుఁడు పండితరాయసూక్తి నాం
ధ్రమున వెలార్చె షేక్స్పియరు
నాటకరాజముఁ జిత్రరీతి శా
ల్యమునఁ దెనుంగుఁ జేసెను బ
ళా యని సభ్యులు సన్నుతింపఁగన్.

సీ. గురుబోధసీయూషఝురి నేబుధోత్తముం
డమృతలహరిఁజొన్పె నమరభాష
రోలంబమిషను నిరాలంబమార్గంబు
బోధించె నే యోగిపుంగవుండు
గురుభక్తిసురభిళవరచాటుశతకముల్
పొగడపూలను పేరఁ బోల్చె నెవఁడు
ధర్మబోధము నే స్వధర్మరతుఁ డొనర్చె
ధర్మధ్వజాఖ్యసద్గ్రంథమందు

గీ. నమృతసందేశ మను ప్రబంధమున నెవ్వఁ
డార్ష విజ్ఞానసంప్రదాయములు తెలిపె
నతఁడు గురుభక్తశేఖరుఁ డాత్మవిదుఁడు
సచ్చిదానందనాథుఁడు సాధువరుఁడు.

సీ. పండితసత్సభావార్ధి కెవ్వనిరాక
పూర్ణచంద్రోదయస్ఫూర్తిఁ బోలుచు
పాశ్చాత్యవాతజవ్యాధి కేని కలంబు
వాతగజాంకుశప్రహారణంబు
శ్రోతృమండలి కేని సూక్తివైచిత్ర్యంబు
ద్రాక్షాసవం బయి తను పోసంగు
రసికాళి కెవని సరసకావ్యములు వసం
తకుసుమాకరమయి తనరు సతము

గీ. కవియు బండితుఁడును భిషగ్వరుఁడు గురుఁడు
నవరసస్ఫూర్తి సచ్చిదానందమూర్తి
యట్టి యవధాని నార్యవిద్యాభిమాని
మాని యెవ్వనిఁ గొల్వనౌ మానసమున.

క. గురుపాదపద్మసేవా
పరతంత్రు స్వతంత్రు ధీరుఁ బరమేశానీ
వరివస్యాచతురానను
స్మరియింతు మదగ్రజన్ము సర్వజ్ఞనిభున్.

గీ. రాజరాజేశ్వరీపదార్చాప్రవీణు
నఖిలవేదాంతవిద్యారహస్యవిదుని

[illegible]

నాంధ్రగీర్వాణకవనరాజ్యాభిషిక్తు
సచ్చిదానందనాథుని సంస్మరింతు.

క. ఓతప్రోతము విశ్వం
బై తనరును గంజనయన! యఖిలము నీ మా
యాతంతుసంతతులచే
నీ తీరున నల్లువాఁడ వీ వగుదుగదా !

గీ. అల్లుఁడవు నీవు గావున నబ్జనయన
నాదు తొలుచూలు కావ్యకన్యకను నీకు
దారవోసితి విబుధసంతతులు కన్నె
పిల్ల నాశీర్వదించి నిన్ వినుతిసేయ.

గీ. అన్న కెటు లిత్తు మలుచూలు కన్నె నన్న
విన్నవించెద వినుమయ్య వేంకటేశ !
కన్నకూతుండ్రు తనకన్న మున్నె దివికి
నరుగుటం జేసి యనపత్యుఁ డయ్యె నతఁడు.

గీ. భువిని గార్హస్థ్యమునకు సంపూర్ణఫలము
పుత్రులను గాంచుటని తలపోసి మదిని
చిరుతవానిని నే చిరంజీవి తులసి
నగ్రజున కిచ్చినాఁడ శేషాద్రినాథ !

ఉ. ప్రీతి మదగ్రజన్మున కపేతజరామరణాదివిక్రియన్
బూతచరిత్ర సాధుజనపూజిత సద్గుణజాలశోభితన్

ఖ్యాతసమస్తభూషణనికాయవిభూషిత స్వర్ణగాత్ర నీ
కుఁతు నొసంగఁగా మదిని గోరితి నెంతయు వేంకటేశ్వరా!

చ. తన యభిమానపుత్రిక నుదాత్తచరిత్రుఁడు విష్ణుచిత్తుఁ డే
యనువున రంగధామునకు నర్థినొసంగెనొ యట్లెయన్నయుఁ
నెసరున దీని నా కృతిని నీకు నొసంగునుగాక యంచు నా
తని కిది యిత్తు నీ కభిమతంబగు నంచని వేంకటేశ్వరా!

క. జిహ్మాగభూషణసేవా
జిహ్మస్వాంతునకు శేముషీసేవధికిఁ
బ్రహ్మజ్ఞాన నిరస్త
బ్రహ్మపురందరముఖామరప్రకరునకుఁ.

క. పూర్ణాభిషిక్తునకును వి
శీర్ణాఖిలశోకమోహశృంఖలునకు ను
ద్గూర్ణసుధర్మధ్వజునకు
నర్ణవగంభీరమతికి నాత్మజ్ఞునకుఁ.

గీ. విన్నవించెద గురుభక్తి విలసితంబు
నాత్మతత్త్వావబోధక మఘహరంబు
నపరవాల్మీకి యన నొప్పు నతని చరిత
మవధరింపుము బ్రహ్మవిద్యానిధాన.

# కథా ప్రారంభము



కం. శ్రీవాణీ వరివస్యా
హేవాకావాప్తమధురహృదయంగమవా
గ్భావప్రపంచబుధసం
భావితపావనచరిత్ర పండితరాయా !

గీ. * విభుని లౌల్యంబునకుఁ గడు వెగటుఁజెంది
పండితాదరణీయ సద్వాక్యఫణితిఁ
గులసతియె తత్త్వజిజ్ఞాస గలుగునట్లు
బోధసేయఁగఁ దులసి ప్రబుద్ధుఁ డగుచు.

---

* తులసీదాసుఁడు నిరంతరము కామకేళీపరతంత్రుఁడై యుండుట చూచి విదుషీమణియగు నాతని భార్యయే గర్హించి హితబోధ మొనర్చెను. ఆమె బోధము నాతఁడు పెడచెవిఁబెట్టి ప్రణయాతృప్త్యమున నామెకిట్లుపన్యసించెను.

గీ. ఆరురుక్షుఁడు దిగజార క్రమముగ
నున్నతం బగు స్థానంబు నొందుఁ బొందెఁ
గాలిబందంబు గానోపుఁ గాంత యరయఁ
దరుణిలేకున్న నరున కీశ్వరుఁడు గలఁడె?

గీ. పాలలీలను జిత్తంబు భవమహాగ్ని
నుడుకఁ గైవల్యనవనీత మొంద భువిని
నాడుదియె తోడు వాస్తవ మరసిచూడఁ
దరుణి లేకున్న నరున కీశ్వరుఁడు గలఁడె.

తులసీదా సిట్లుపన్యసింపఁగా నాతనిభార్యయైన మమతాదేవి యిట్లు సమాధాన మిచ్చెను.

క. పరతత్త్వాన్వేషణముం
బురికొల్పుచుఁ దనకు బంధమోచన మీాయం
గరుణఁ బరాంబయె యిటు లవ
తరించె నని భావమందె తరుణికి మ్రొక్కెన్.

గీ. నాథ! వలయును గురుమథనం బటంచు
మమత బల్కిన మాటలు మదిని నిల్పి
దేశికు భజింపు మను నుపదేశముగ గ్ర
హించి మరుమాట పల్కక యిల్లు వెడలి.

---

మ. అనఘా! యెంతటిదాన నిన్ దెలుప స్థూలాయంథతీన్యాయమై
వనితాచందనమాల్యలేపములు సంభావింప భావ్యంబగున్
ఘనమై నిర్భయమై యఖండమయి నిష్కామంబునై శాంతమై
చను నా బ్రహ్మసుఖానుభూతి మనుజుల్ సాధించుయత్నంబునన్.

కం. చెకుముకి రాతను గల్గుశిఖికణముల, వెలుఁగు తిరంబే? కృతియగు నతఁడా
చెకుముకి సాయమునను దీపిక వెలిగించి సుఖియించు పీతతముఁడెమ్మై!

గీ. ఆరురత్నున కరయ నీ వన్నయట్లు
కౌలిబందంబె యగు నుపకారి నిజము
బంద మిడుకొని క్రిందనే ప్రాఁకులాడ
నడుగు సాగునె? పడఁడె యాజమఁడు చెడఁడె?

గీ. తోడు బెట్టిన మాత్రాన దుగ్ధమందు
వెన్నఁబడయఁగవచ్చునె యెన్నఁడైన
నిశ్చలంబుగ క్షీరంబు నిలుపవలయు
నాథ! యటులైన గురుమథనంబు వలయు.

భార్యయే యిట్లు సమపదేశ మొనర్పఁగాఁ దులసీదాసుఁడు విరక్తుఁడై తత్త్వజిజ్ఞాసువై గుర్వన్వేషణ మొనర్ప నిలువెడలెను — ఇది పూర్వభాగ కథాసంగ్రహము—

క. సెజ్జ దిగనట్టి రసికుఁడు
విజ్జోడై సతిని వీడి విపినపథములన్
మజ్జారే! శ్రమ మెఱుఁగక
యొజ్జల వెదకుచు దిరిగె నహోరాత్రంబుల్.

గీ. మాటిమాటికి మమతసంభాషణముల
మదిని స్వర్ణాక్షరంబులఁ గుదురుపఱచి
యింతిమెచ్చుచుఁ దన్ను గర్హించుకొనుచు
నలఘుచరితుండు తులసి దా ననియె నిట్లు.

గీ. మమత గలిగించి తొలుత నిర్మమతఁ బిదప
బోధసేసితి వీవె సంపూజ్యచరిత!
మబ్బుగ్రమ్ముచు భాస్కరమండలంబుఁ
గప్పివిప్పెడు పవనుని కరణి తోఁప.

క. రామా! నిన్ దలఁపక యె వి
రామం బొకయింతలేక రతులం దేలన్
రామారత్నంబే సా
రామలసుజ్ఞానబోధ మలవడఁ జేసెన్.

గీ. చిల్లరతలంపులను జాలఁ జెల్లెఁ బ్రాయ
మేల మోహము బోధ మిల్లాలె యిచ్చెఁ
గచకుచంబుల మఱచి వికచహృదబ్జ
కరికాపీఠి స్మరహరుఁ గనుమ మనమ!

క. స్మరలీలాసౌఖ్యంబుల
స్మరణము రానీకు నాకు స్మరహర! యింకన్
స్మరణా న్మక్తి యనెడు భవ
హరమగు వాక్యార్థబోధ మర్థింతు నినున్.

క. దాశరథీ! నీ చరణము
లే శరధిప్రతిమభవము నీది సుఖింపం
గా శరణ మంద్రు, కీలక
మాశించెద దాని దెలుపు మంభోజాక్షా!

శా. రామా! మారవినోదలంపటుడనై
రామాపరిరంభమే
భూమానందద మంచు నెంచి మది వ్యా
మోహాంబునుం బెంచి సు
త్రామాదిత్రిదివేశపూజితభవ
త్పాదాంబుజధ్యానమా
ధ్వీమాధుర్య మెఱుంగకే తిరిగితిన్
దేవా! ననుం గావవే!

ఉ. ఇంతకు మున్ను చూచిన యహీనబలుండు క్షణంబులోనఁ దా
నంతకుఁ జేరఁబోవు దనుజాంతక! దీని రహస్యకారణం
బింతయుఁ గానరాదు సృజియింతువు పెంతువు త్రుంతు వేటికీ
జంతుగణంబు నీకు నిది శర్మమొ? ధర్మమొ? లేక కర్మమో?

క. దేహాత్మబుద్ధినై వ్యా
మోహాబ్ధిని మునిఁగి యకట! ముగ్ధుఁడనై నీ
మాహాత్మ్య మెపుడుఁ దలఁపన్
శ్రీహరి! నన్నింక నేమి సేయఁదలఁచితో.

ఉ. గానుగఁ ద్రిప్పునట్టి తిలఘాతుకు నెద్దువిధాన గమ్యముం
గానఁగ లేక యింతదనుకన్ భ్రమియించితి రొప్పవచ్చె నా
చే నిఁకఁగాదు నీకు నిదె చేతులు మోడ్చి నమస్కరింతు రా
మానుజ! నందగోవ్రజము నందురహి న్ననుఁ జేర్చి కావుమీ!

గీ. గానుగెద్దున కట్టులు గంతగట్టి
త్రిప్పినను నాకు నిసుమంత నొప్పి లేదు
నీదు స్నేహంబుఁ జేసిన నీరజాక్ష!
వాడుకొను మెట్టులైన నీ వాఁడ నేను.

ఉ. శైశవమందు బాలకుఁడు సర్పముఁ గాంచిన శంక లేక యా
వేశముతోడ నాడుకొనుఁ బెద్దతనంబున భీతుఁ డౌనటుల్
లేశముఁ దత్త్వచింతనము లేనితఱిన్ జగమెంచి మెచ్చితిన్
దాశరథీ! తలంప నది నాకిపుడెంతొ భయావహం బగున్.

క. పగపట్టినట్టి యహివలె
న్నగమట్టులు వెంటనంటె నగధర! నన్నున్
జగ మెరియఁ జేయు నాకీ
దగఁదీర్చి చేయు మింక నుదాసీనునిగా.

క. కాపుర మిది యెన్నఁగ లం
కాపుర మద్దానికి నలుగడలఁ గడలి య
ట్లేపారు మోహ మో సీ
తాపతి! తత్పురహరణవిధంబుఁ దెలుపవే!

ఉ. కూడును నిద్రమాని నినుఁగూడఁగ మానిని వీడి యెప్డు నీ
తోడటుఁగొల్వ మారుతసుతుంబలెఁ దోయధిదాటి లంకలో
జాడలవాడలన్ వెదకి జానకిఁ జూడ నికెట్లు నేను నీ
వాఁడనటంచుఁ జెప్పుకొనువాఁడను సిగ్గఁడి నాచు రాఘవా.

క. మానినులఁ దలఁప కిఁక వను
మానము రానీక నిరభిమానవ్రతినై
మానసమందున శ్రీరా
మా! నీ పదపద్మయుగము మానక కొలుతున్.

మ. త్సరువిన్యస్తకరాంగుళీనిచయుఁడై సౌమిత్రి యన్వీతుఁడై
యరుదేరన్ సవనావనగ్రథిత గోధాలంక్రియోచ్ఛ్వాన భా
స్వర యుష్మత్కరపద్మమాఋషులకుత్సాహంబుఁగల్పింపనా
సురపాళింబెదరింపఁగా నోలయు నీసాంపెన్నుదున్ రాఘవా.

చ. లవకుశు లల్లనాఁడు ప్రబలంబగు రోసము మోసులెత్తఁగా
సవనహయంబుఁబట్టి నిను సంగరమందు నెదిర్చిరేని త
ప్పెవరిది నీదె కాదె? నిజవృత్త మెఱింగిన భేదమున్నె? వా
స్తవముగ నీకు నే నెవఁడ? దాపక తెల్పుము జానకీపతీ!

ఉ. ఆఁకలివేళ గుఱ్ఱెటేఁగి యంబయె చన్నులఁజేపి పీఁకమై
సాఁకెడుఁగాని బిడ్డఁ డవశంబుగ నేడ్చుటగా కెఱుంగునే
నాకుయు లాలకించి రఘునాయక! యెయ్యదియింక మీఁదటన్
నాకు హితంబొ యద్ది కరుణాసమకూర్చి యనుగ్రహింపవే.

చ. అనదయటుల్ దశాననుని
యాఁకఁ గృశించుచు మోక్ష మీయవే
దనుజవిరామ! యంచు వసు
ధాసుత కయ్యెడు నంతెకాని పా
వనిఁ బనిగొంట వారిధికి
వారధిఁ గట్టుట శత్రువర్గముం
దునుముట రామ! నీ పనియె
తొయ్యలి యొండొనరింప నేర్చునే?

ఆ.వె. ముద్రమూలమునను భూసుత నీజాడఁ
దెలిసి భయము వీడఁగలిగె రామ
భద్ర! నిన్నుఁ దెలుపుముద్రను దయసేసి
భవసముద్రభయముఁ బాపుమయ్య.

క. దర్శాదినియతి సల్పిన
దర్శనపాఠంబు లెన్ని తడవిన నీదా
దర్శనలాభము లేక ని
దర్శన మానొక్కొ రామ! తత్త్వ మెవరికేన్.

గీ. దశరథుం డయ్యు నిన్ను నీతండ్రి విరథుఁ
జేసి రాకాసిమూఁకలఁ జెనకఁ బంపె
నా మనోరథ మిత్తురా రామ! రార
పదితలల మొండిరాకాసి బ్రతుకుఁ జెరుప.

గీ. అర్థి నిను నాదు చిత్తసింహాసనమున
నుంచి పట్టాభిషేకమహోత్సవంబు
సేయువాఁడను రాఘవా! చెలఁగి రార
కానలకుఁ బంప నీయెడఁ గైక లేదు.

గీ. భోగినీతల్పతలమునఁ బొంగిపొరలి
యదియ వైకుంఠ మనుకొని యలరినాఁడ
భోగినీనాథతల్ప! యీ భోగమేల
బ్రోవు మెప్పుడు నన్ మహాభోగిఁ జేసి.

ఉ. నారకబాధకున్ వెఱవ నాకసుఖంబుల కాసఁ జేయ నీ
తారమణా! త్వదీయపదదాసునిగా నను స్వీకరించి నీ
తారకనామకీర్తనసుధారసపాన మనుగ్రహించితేన్
గోరిక యింతయే కోలుఁతుఁ గూటికి బత్తెము నీయవేనియున్.

ఉ. నాకమునాకమంద్రురఘునాయక! యింద్రునికన్న నెన్న ము
ల్లోకములందు శోకభయలోభవిమోహితుఁడున్నె రాక్షసా
నీకభయంబునై నతఁడు నెంజిలిఁ జెందుట చాలకయ్యయో!
సూకరముఖ్యనీచభవశోకము నీకును గట్టిపెట్టఁడే.

ఉ. ఇంచుక తెప్పపాటోదవె నేనియు నా క్షణమందె నన్ను వం
చించి యదృశ్యుఁ డౌదువను చింతని మేషముమాని తారకల్
వెంచి నిరీక్షసేయుదును వెంగలి వైఖరిదోఁప నెప్పు డే
సంచున నెట్టితావులను జయ్యనఁ దారకమూర్తి! వత్తువో

ఉ. అక్షిని వర్త్మమట్టు లనయంబు నయంబున నిన్ భజించు న
న్నక్షుఁడు లక్ష్మణుం డతని వైఖరి సాధ్యమె నాకు? నీకృపా
వీక్షణ మబ్బినన్ భరతువీఁక భజించెద నయ్య పాదుకా
దీక్ష నొసంగవే! వసుమతీతనయాహృదయాధినాయకా!

ఉ. దారులు కొట్టికొట్టి జడదారిగఁ దారకమూర్తి! త్వత్కృపం
దీరి త్వదీయపుణ్యకథఁ దియ్యని పల్కుల నాదికావ్యమున్
బేరును గన్న సత్కృతిని నిల్పఁడె ముక్కొక బోయవాఁడు నా
భారము నీయదే పతితపావన! నన్నెటు లుద్ధరించెదో.

శా. నిన్నుం దిట్టను నీదు భక్తవరుల
న్నిందింప హింసింప న
న్నన్నుల్ గన్నుల విందు సేయుచును
మోహాంభోధిఁ దోఁియంగఁ బై
కొన్నన్ జారితి నెట్లొ తేలితిని
నీకుం దాసుఁడన్ దేవ! యా
పన్నానీక శరణ్య! నన్ విడువ
భావ్యంబౌనె సీతాపతీ!

చ. అడవికి నిన్నుఁ దోలు సవతమ్మపయింగనలూన వీవు నీ
బుడుతని నన్ను సైచుటది పోలదె? చాలదె శిక్ష? యింకనో
జడధిశయాళుమూర్తి! నను సత్కృపతోఁ దరిఁజేర్చి నాకు నీ
యడుగులయాశ్రయంబిడి భవాంబుధిలోఁబడకుండఁ దేల్చుమీ.

క. రాతిని నాతిఁగఁజేసితి
క్రోఁతికి స్థిరమైన భక్తిఁగూర్చితి వదిరా!
సీతాపతి నీ మహిమము
నాతరమా? పొగడఁగ గవనము నేరిచినన్.

ఉ. కైత యొకింత నేర్చి నిజకైతవమంతయుఁ గప్పిపుచ్చి యీ
రీతిని నీతిమార్గ మురరీకృత మయ్యె నటంచు నేర్పుమై
నీతఁడు పల్కెనో యని యుపేక్షయొనర్పకు రామచంద్ర!స
చేతము నీకుఁ గైవసము చేసితి చీల్చి పరీక్ష సేయుమీ.

గీ. విశ్వమయుఁడవు నీవంచు వినఁగఁబడెడు
నెందు వెదకినఁ గనరా విఁకెందుఁబోదు
నే దహరదేశమున నుందొ? యేగుహాంత
రమున దాఁగెద వొక్కొ నరహరి చెపుమ.

క. వినయమునఁ బ్రణతిసేసెద
ననయము మీపాదరజము నొదలఁదాల్తున్
వనవాసులార! శ్రీరా
ముని జాడలఁ జూపరె మునిపుంగవులారా!

గీ. వేణురూపముఁ దాల్చి గోపీసనాథు
ధనువుచందమునంది కోదండరాము
సతతము భజించునట్టి వంశంబు మీది
వంశమా! రాముఁ డెందున్నవాఁడొ చెపుమ.

ఉ. మీ కులవృద్ధుఁడౌ చిలువమేఁతరి వారువమైన చెల్మినై
చేకురె మీకు విష్ణుపదసీమ ఘనావళితోఁ జరింపమేటి
యాఁకయు నష్టులేక ద్విజులం దెవ రా పదమందినార లి
క్ష్వాకుకులప్రదీపకునిజాడ విహంగములార! తెల్పరే.

శా. సాకేతాధిపపాదపద్మమధుకోశంబైన వాల్మీకి క
స్తోకాలంబ మొసంగి సంయమిజనస్తోమంబు సేవింప సు
శ్లోకత్వంబును గాంచినారహహా! ముల్లోకంబులన్ మీరు వ
ల్మీకోత్తంసములార! తెల్పరొకొ సౌమిత్ర్యగ్రజస్థానముల్.

మ. హరికైంకర్యనిరూఢిమై విభునితాదాత్మ్యంబు సిద్ధింపఁగా
హరినామంబున వన్నెకెక్కితిరి ధన్యాత్ముల్ గదా మీరువా
నరులంచున్ మిమునవ్వువార్గనరులోనంగల్గుమాహాత్మ్యముం
గరుణన్ నాకు హరీశులార! వెస నిక్ష్వాకూద్వహుం జూపరే.

ఉ. పాయకతోయమందు సహవాసముచేసిన కూర్మిపేర్మి నా
రాయణుఁడే త్వదీయమగు నాకృతిఁ జెందె ఝషంబులార! మీ
కేయతివర్యుఁడున్ సరియె? యించుక నన్ గరుణించి శంకర
ధ్యేయుని జూపరే వసుమతీతనయాధవు నద్వితీయునిన్.

శా. శీతచ్ఛాయల సేదఁదేర్చి వనిలో
శ్రీరామసేవారతిన్
మీ తోఁబుట్టువు మించఁగల్గితి రహో
మీపుట్టువుల్ ధన్యముల్
చేతుల్ మోడిచి భక్తి నియ్యెడ ప్రశం
సింతున్ మిము న్నాకస
జ్ఞాతాపూర్వనసత్ఫలం బిడరె భూజ
శ్రేష్ఠముల్ సత్కృపన్.

క. నీరజములార! కమలా
గారములారా! భజింతు ఘటితాంజలినై
మారాముఁ జూడఁ గలిగెదు
మారాముంజూపి నన్ను మనుపుఁడు కరుణన్.

ఉ. చేవ యొకింత చేడ్పడక శేషజగత్ప్రళయంబెయైన యా
శ్రీవరు సెజ్జయై మిగులు శేషుఁడు మీ కులవృద్ధుఁ డొక్కఁడే
యా విభుఁడుండుజాడల రవంతఁగ నా కెఱుగంగఁ బల్కుఁడా
శీవిషనాయకుల్ గరుణఁ జేసి నుతించెద మిమ్ము నిచ్చలున్.

గీ. ఉవిద చట్రాతిబంధమై యుండెనేమి
దాశరథి దివ్యపాదపద్మములు దాల్చెఁ
జపలచిత్తమ! నీకు లజ్జయును లేదె
యరయ నీకన్నఁ బాషాణమైన మేలు.

క. నాయన యుపదేశ ముపా
దేయము గాదంచు నకట దిమ్మరినైతిఁ
నా యనువార లిఁకెవ్వరు
శ్రేయము దెలిపి భవమును దరింపఁగఁజేయన్.

గీ. బాలకుఁడు దారి దప్పి యంబా యటంచుఁ
దల్లికై మొఱవెట్టు చందమున నతఁడు
రామ! రామా! యటంచు నార్వంగ నపుడు
రామమయ మయ్యె రోదోంతరాళమెల్ల.

క. రామా! రాఘవ! భూమిసు
తామానసరాజహంస! దైత్యవిరామా!
సామీరివత్సలా! రా
రా! మాదృశులకు నెవండు ప్రాపు నిను వినా.

గీ. చేత మీరీతి మిగుల నుబ్బూతలూఁగఁ
జేతనాచేతనాఖిలభూతతతికిఁ
జేతులొగ్గుచు నతఁ డెల్లచేత లుడిగి
యడవులంబడి విభుజాడ లడిగి యడిగి.

గీ. రామపాదాబ్జయుగ్మమరందపాన
కౌతుకంబున నాహారకాంక్ష విడిచి
తారి యిటునటుఁ దులసి కాంతారసీమ
నలసి నిదురింప నంతట నవని కొరగె.

గీ. అట్లు నిద్రితుఁడై యున్న యవసరమున
నతని జనకుఁడు స్వప్నసంగతుఁడుగాఁగ
హర్షసంభ్రమములు మది నలముకొనఁగఁ
దాతపాదుల పాదపద్మములుపట్టె.

క. అంతట నాత్మారాముఁడు
స్వాంతం బుప్పొంగి వెలికిఁ బ్రమదాశ్రుపరి
క్రాంతిం దోఁపఁగ నిజబా
హ్వాంతరమునఁ గొమరుఁజేర్చి యనురక్తి ననుక్.

క. రామాది సర్వవిషయ
గ్రామము నిరసించి నీ వఖండమనీష
సామీరి యటులు సీతా
రాముల కైంకర్యతత్పరత్వముఁ గనుమీ.

గీ. వృద్ధవిప్రుని వేసంబు వెలికిఁదోఁప
మానులను గూడి వినును రామాయణంబు
నాంజనేయుఁడు గాశిలో ననవరతము
వానిఁ గొల్చినఁ దెల్పుఁ దత్త్వంబు నీకు.

క. అనిపల్కి యదృశ్యుండై
జనకుఁడు చనఁ దులసి నిదురఁజాలించి మనం
బున హర్షాద్భుతములు పెనఁ
గొనఁగా స్వప్నంబు నిజమగునొకో యనుచుక్.

గీ. హితముఁ దెల్పిన వినక మోహితుఁడ నగుచు
మేరమీఱిన నన్ను క్షమించి యిటులు
మోక్షమార్గముఁజూపి ప్రబుద్ధుఁజేయు
తండ్రివాత్సల్య మెన్నంగఁ దరమె నాకు.

క. కలలెల్లఁ గల్లలనఁగాఁ
గలమే? యరయంగ నాదు కల యిది యగు ని
క్కలయంచు మదినిఁదోఁచుం
గలరూ పెఱుఁగంగఁబోదుఁ గాశీపురికిన్.

క. కల కల్ల యయ్యెనేనియుఁ
గలదే నష్టంబు జనకుఁ గాశింజూడం
గలవాఁడ నిక్కముగ శశి
కలాధరుని జూచి క్రొల్వఁగాఁ గలవాఁడన్.

గీ. చెప్పఁగావిందు మును జిరంజీవి యాంజ
నేయుఁ డంచని కాశిలో నిక్కమతఁడు
రామదాసులకెల్లఁ దారకుఁడుగాఁగ
నిలిచియుండఁగఁబోలుఁ దన్నిష్ఠుఁ డగుచు.

ఉ. నాకభయంబొసంగి రఘునాయకపాదసరోజయుగ్మమా
ధ్వీకరసప్రలుబ్ధసుమతిస్థిరవృత్తి నెసంగఁజేసి దు
ర్లోకమునందు మోహముపిలూన మొనర్చియనుగ్రహించినన్
సాఁకి తరింపఁజేయు గురునాథుని దర్శనభాగ్య మెన్నఁడో.

క. గీర్వాణాంధ్ర సుకవితా
ధూర్వహ! శర్వాంఘ్రియుగ్మతోయజసేవా
నిర్వాహనిర్వృతైహిక
సర్వాశా! విమలకీర్తి సంవలితాశా.

ఇది శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహావిద్యాపీఠస్థాపనాచార్య
శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్ష లబ్ధ సారస్వతో
పాసనాసాదిత సరసకవితావిలాస శ్రీనివాస కవికృత
గురుభక్తినామక శ్రీ గోస్వామి తులసీదాస
చరిత్రోత్తరఖండ మహాప్రబంధంబునందుఁ
ప్రథమాశ్వాసము
ఓ మితి శివం.



శ్రీ భాష్యాయనమః

# గురుభక్తి



## ద్వితీయాశ్వాసము



క. శ్రీగురుచరణసరోజప
రాగవిలేపాపరాగ! ప్రవిమలభావా!
వాగీశసన్నిభా! భవ
రోగచికిత్సాప్రవీణ ప్రమతివిస్తారా!

క. కలఁగని తులసీదాసుఁడు
కలగని చిత్తంబుతోడఁ గలుష మడంపన్
గలఁ గనికరించె నాకుం
గలవాఁడై జనకుఁ డంచుఁ గదలె రయమునన్.

ఉ. ఆఁకలి నీరువట్టు నిసుమంతయు స్వాంతమునం దలంప క
ప్రాకృతమా రయంబున నరణ్యము లేఱులు దాఁటి పట్టణా
నీకము పొంతఁ బోకెచట నిల్వక యెండయు వాననాక మా
రీకృతపాపుఁడై తులసి వ్రేల్మిడిఁ జేరెను గాశికాపురిన్.

ఆ. వారణాసిఁ దులసి వారక తిరుగుచు
సకలఘట్టములను జనకుజాడ
లరసి యరసి కాంచె నాశ్రమం బొక్కండు
ప్రొద్దుపోవుచున్న వేళఁ బురివెలుపల.

క. ద్వారమున నొకనిఁ గని యా
త్మారాముని నిలయ మెఱుగుదయ్యా! యనఁగాఁ
జేరి తులసిఁగని కన్నుల
నీరొలుకఁగ నిట్టులనె వినీతి నతండున్.

చ. ఎఱుఁగుదు నమ్మహామహుని
నియ్యదె తన్నిలయంబు నీదు రూ
పరయఁగ వారి పోఁడిమి యొకింత
గనంబడుఁ దెల్పుమయ్య సో
దరుఁడవొ కాక పుత్రుఁడవొ
తాపసవర్యున కీవటన్నఁ ద
త్తరమున వాని కిట్లనియె
దాసుఁడు గద్గదభాషణంబులన్.

ఉ. నేమమె నాదుతండ్రికి వచింపుము నీ తడఁబాటుఁ జూడఁగా
మామకచిత్తమందు ననుమానము గల్గెడు నన్న, సోదరా!
యేమని తెల్పువాఁడ నిఁక నేగుము లోనికిఁ బుత్రుచేతితో
నేమముమీరఁ జేయఁదగు నిష్ఠురకర్మ మొనర్పఁ దండ్రికిన్.

గీ. అనిన వజ్రాహతినిఁ గూలు నద్రివోలెఁ
దులసి మూర్ఛిల్లిపడి యంతఁ దెలివినొంది
యల్లనల్లన జనకు దేహంబు దరికిఁ
బ్రాకి తత్పాదములఁ బడి వగచి వగచి.

ఉ. నాయన! నాదు సేమము మన
మ్మునఁ గోరి హితోపదేశముం
జేయఁగ నిన్ను నే సరకు సేయ
నటంచని యాగ్రహించి యి
ట్లీమెడ మౌనముద్ర వహియించితె ?
యింకొకమారు త్వత్సుధా
ప్రాయసుభాషితంబుల శ్రవః
పుటయుగ్మము నింపవే దయన్.

శా. వాత్సల్యామృత మొల్కు
చూపులను నాపైఁ బర్వఁగాఁ జేసి నీ
యుత్సంగమ్మున బాలు నన్నునిచి
భక్త్యుద్రేక మేపార శ్రీ
వత్సాంక స్తవరాజముల్ గఱపి
తాత్పర్యంబు బోధించి నీ
వుత్సేకింతు వదెల్లనున్ మఱచి
నావో తండ్రి యిప్పట్టునన్

ఉ. బాబును వీడలేనని దివాణము
లోనికి నేగు వేళ ము
స్తాబగు నన్ను వెంటఁగొని
శైశవ మాదిగఁ గొల్వులోని హే
జీబులు నన్ను మెచ్చి తులసీ!
తుల యే రిల నీకటం చనఁ
జాబిలిఁగన్న వార్ధి యటు
సంతసమందుట విస్మరించితే.

చ. గురుకులవాసఖేదమునకుం
దగఁడీ సుకుమారుఁ డేన య
బ్బురముగ నింటనే గఱపు
వాఁడను శాస్త్రములెల్ల నంచు సా
దరముగ నాకు విద్యల య
థావిధి నశ్రమలీల నేర్పి సం
బరపడు నీదుకూరిమి యభా
వముఁ జెందెన తండ్రి! నేటికిన్.

గీ. ఇట్లు జనకుని వాత్సల్య మెన్నియెన్నొ
తలఁచుకొని కంట నీర్వెట్టు తులసిఁజేరి
కరుణ దళుకొత్త నొయ్యనఁ గౌఁగిలించి
యాశ్రమంబున నున్నతఁ డనియె నిట్లు.

గీ. సర్వమెఱింగియు నీవిట్లు జనకుఁదలఁచి
పామరునివోలె వాపోవఁ బాడియగునె
యిటకు వత్తువు నీవని యెఱిగి నీకుఁ
దెలుప నాతోడ గురుఁడిట్లు పలికె వినుము.

క. దేహాత్మబుద్ధినై యీ
దేహమె త్వజ్జనకుఁడని మదిం దలఁచెద వా
దేహం బిచ్చట విడిచి ని
రీహం జనువాఁడ శోక మీఁగుము పుత్రా.

ఉ. దేహముకన్న భిన్నమగు తేజ మదాహ్య మగోచరం బదే
నూహకు నందరాని దొకఁడున్నదటంచు నెఱింగితేని యీ
దేహము నాఽహమంచు వినతిం గురుదేవుని సేవఁజేసి సం
దేహముఁబాసి శోకజలధిం దరియింపుము తత్త్వవేత్తవై.

ఉ. ఈయుపదేశమున్ వినిచియెంతయునిస్పృహనీదుతండ్రియీ
కాయముఁ బాసి తాఁజనియెఁ గాతరబుద్ధిని వెక్కి వెక్కి వా
పోయిన వత్తురే మఱలిపోయినవార లనంగఁ దేఱి శా
స్త్రీయవిధుల్ పొనర్చెనుబిత్రృణముఁదీర్చఁగదాసుఁడంతటన్.

గీ. చెంతనున్నట్టి తనతండ్రి శిష్యుఁజూచి
యిన్నినాళ్ళుగ నీదు పేరేని యడుగ
నైతి నీ వెవ్వఁడవు తెల్పుమన్నఁ దులసి
కాతఁ డిట్లనె నయమునఁ జేతులొగ్గి.

గీ. నను సుశీలుఁ డటంచు రో. యనఘ! వినుము
చిన్నతనమునఁ జదువుల చెంతఁబోక
యాలపోతట్లు స్వేచ్ఛ నెందైనఁదిరిగి
జూదరులఁ గూడి యోడి వివాదమగుడు.

గీ. పారిపోవఁగ వెన్నంటి వారు నన్నుఁ
బట్టికొని కొట్టి గంగలోఁ బారనైవ
నీదు జనకుఁడు మదిఁ గరుణించి కాచి
తనదు కింకరునిగఁ జేసికొనియె నన్ను.

శా. నేమం బొం డెది లేక సంతతము నంతేవాసినై మద్గురు
స్వామిశ్రీచరణాంబుజాతయుగసేవానిష్ఠ యొక్కండె స
ద్యోమోక్షప్రదమంచునమ్మి మది సంతోషింతు నిన్నాళ్లు నే
నేమై నెవ్వరిఁగొల్తు నింకననటా! యేదిక్కునం బోవుదున్.

గీ. అనుచు నీగతి వాపోవు నతనిఁ బ్రీతి
దగ్గఱకుఁదీసి యిట్లను దాసుఁ డంత
చదువనైతి నటంచు సంశయము విడుము
చదివినంతనె విడదు సంశయము భయము.

ఉ. నీకును నాకు దిక్కు నళినీదళనేత్రుఁ డతండె దేశికుం
డై కనుపించుఁ గాశిఁ బవనాత్మజుఁ డాత్మవిదుండు వృద్ధవి
ప్రాకృతి నుండు నీ వతనిఁ బ్రార్థనసేసి తరింపుమంచుఁదా
నా కెఱిఁగించె మున్గలఁ గనంబడి తండ్రి కృపార్ద్రచిత్తుఁడై.

ఆ. కన్నకొడుకుకన్న కన్నాకువై తండ్రిఁ
గొలిచియుంటి నాకు నలఘుచరిత
సోదరుఁడ వనంగ నౌదువు మనకింక
గతియొకండె సుఖమొ కష్టమైన.

గీ. అనుచు సాంత్వనవాక్యాల నతనిఁ దేర్చి
వానితోఁ గూడ దేశికస్వామిఁ గాంచు
నుద్యమంబునఁ గాశిలో నున్న సర్వ
విబుధగోష్ఠులలోఁ జొచ్చి వెదకు నెపుడు.

గీ. అంత నొకనాఁడు జాహ్నవి కరిగియతఁడు
మధురగంభీరభావసంభరితవాగ్వి
లాస మేపార సకల కల్మషచయాప
హారిణిక విష్ణుపది నిట్లు గీరితించె.

మ. హరిదివ్యాంఘ్రియుగారవింద
మకరందాపూర్తిఁ జాల్వారి, శం
కరమౌళీందుగళత్సుధారస
ఝరీకల్లోలమాలాపరం
పరలం బుష్టి వహించి, త్వత్స
లిలరూపంబందె ద్వైతభ్రమా
కరచక్షుస్తిమిరాంజనం బగుచు
నిక్కం బెన్న మందాకినీ!

మ. నరమాత్రుల్ నినుఁ బ్రస్తుతించు టది
వింతా? ప్రేమ్మమన్నించి యీ
శ్వరుఁడే నిన్ శిరసావహించు
దురితవ్రాతంబుఁ ద్వత్తీర్థశీ
కరసంస్పర్శన మాత్రమేనియును
బ్రక్షాళించు నెల్లప్డు నీ
దరి వాసించిన వారి కెట్టి
సుమహాత్మ్యం బిత్తొ మందాకినీ.

మ. కథలే! నీ పరిచర్య సేయ
గలభాగ్యం బెన్న నెన్నె భగీ
రథయత్నంబులఁ జేయ
కూరక యె సంప్రాప్తించునే ? నీదు స
న్నిధి మానీంద్రుల కెల్ల మోక్ష
నిధి భ్రాంతిం బాపి మిథ్యామనో
రథజాలంబును ద్రెంపి డింపగదె
భారంబెల్ల భాగీరథీ.

మ. చనుఁ ద్రావన్ జననీవళీస్థలిని
స్వేచ్ఛం గ్రీడలం దేలుబా
లుని లీలన్ సతతంబు నీయలలలో
లోలుండ నై తేలి హా
యినిఁ దాపత్రయ మేద
నుండుటయె కా కే నేమియుం గోరఁ ద
ద్ఘనయోగంబునఁ గూర్పు మీ
జనికి సార్థక్యంబు మందాకినీ.

శా. గేయంబౌగద త్వచ్చరిత్రము
వివేకింపంగ నోయంబ! గాం
గేయంబుం గని నట్టి గర్భమున
యోగిశ్రేష్ఠు బ్రహ్మణ్యు గాం
గేయుం గంటివి భారతీయులకు
భుక్తిన్ ముక్తిఁ గల్పింప మా
తా! యీవిన్ సరి నీదు సంతతికి
సంతానంబె మందాకినీ.

శా. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను
బ్రజ్ఞానం బవిచ్ఛిన్న మ
వ్యగ్రంబై వెలుఁగొందు చందమున
మర్త్యామర్త్యపాతాళలో
కగ్రామంబున సర్వపాపశమన
ఖ్యాతిం బ్రవర్తింతు వే
కగ్రీవంబుగ శైవవైష్ణవులు నిన్
గాంక్షింప మందాకినీ.

గీ. జాహ్నవీమాత నీ రీతి సన్నుతించి
తత్పవిత్రజలంబులఁ దానమాడి
విశ్వనాథున కభిషేకవిధులఁ దీర్చి
భక్తి దళుకొత్త నీరీతిఁ బ్రస్తుతించె.

మ. బహుధా తోఁచునదెల్ల కల్ల
కల సర్వం బాత్మ యంచున్ బుధుల్
బహుమార్గంబుల బోధసేసినను
దుర్వారంబు లౌచుఁ జుహు
ర్మహురుద్భూతములౌ దశాస్యుని
శిరంబుల్ వోలె దుర్వాంఛ లి
మ్మహి బ్రహ్మాస్త్ర మనుగ్రహింపు
బగళాంబానాథ విశ్వేశ్వరా.

శా. నైరుష్యంబు వెలార్ప దంభమున
'సర్వం ఖల్విదం బ్రహ్మ'యఁ
వేదాంతోక్తుల నోటఁ బల్కుటయె
కానీ దృశ్య జాలంబునఁ
భేదజ్ఞాన మదెట్లు మాను ? మది
శాంతిం జెంద నెట్లానౌకో ?
నీదౌ మిక్కిలి చూపు నీయవె
మృడానీనాథ విశ్వేశ్వరా!

శా. ద్వైతభ్రాంతి మునింగి వేల్పు
లమృతప్రాప్తిఁ మదిం గోరుచుఁ
జేతుల్ వెండువడంగ మందరమునఁ
క్షీరాబ్ధిం ద్రచ్చంగ ను
ద్భూతంబౌ విష మీవు ద్రావియుఁ గడుం
బొల్పారు టెన్నంగ న
ద్వైతం బీ విషచేతఁ దెల్పితనుచుఁ
భావింతు విశ్వేశ్వరా.

మ. దనుజత్రస్తులు భోగలాలసులు
సుత్రామాది బృందారకుల్
ఘనయత్నంబునఁ బాలవెల్లిఁ
దరచంగా నేల ? నీచే విషం
బును ద్రాగించఁగ నేల ? ముప్పవడి
వాపోనేల ? యిష్టార్థముల్
మును మృత్యుంజయు నిన్నుఁ గొల్వ
సఫలంబుల్ గావె విశ్వేశ్వరా.

శా. ఆ రాముల్ జపియించుచున్
సతము బ్రహ్మానందపూర్ణుండవై
యారామంబున సర్వలోకములు
ఫాలాక్ష్యర్చిజాలంబునన్
నీ క్షేత్రంబుగఁగఁ దాండవించు
భవదున్నిద్ర ప్రతాపోదయాం
కూరంబున్ మది నాటగాఁ
దగదె నీకుంగూర్తు విశ్వేశ్వరా.

శా. మృత్యుంజయమ్మున మంత్రమూర్తి
యగు నయ్యిందీవరశ్యాము నీ
వుత్కంఠన్ నెలకొల్పి ధ్యానసుధలో
నోలార్పఁ దద్దేహ భా
స్వత్కాంతుల్ గరగంగఁ బారి
గళశోభం గూర్చుఁ గాకున్న న
య్యుత్కృష్టప్రభ గల్గునే
విషమునం దూహింప విశ్వేశ్వరా.

గీ. ప్రతిదినంబును నీరీతి భక్తవరుఁడు
జాహ్నవీపూతజలముల స్నానమాడి
యన్నపూర్ణాసనాథుని సన్నుతించి
గురునిజాడల నడుగుచుఁ దిరుగుఁ బురిని.

గీ. పదియు రెండేఁడు లీగతిఁ బట్టు విడక
పురిఁ బౌరింబౌరి బుధజనములను జేరి
యాంజనేయుని జాడల నరసి యరసి
తెలియనేరక దాసుఁడు దిగులు చెంది

గీ. తప్పితారుచుఁ దల్లికై తల్లడిల్లు
బాలు లీలను వెక్కుచుఁ బాలిపోయి
చిక్కి స్రుక్కుచు నున్న సుశీలుఁ డతనిఁ
గాఁగిటంబట్టి యను ననుకంప మెరయ.

క. నీవంటి విబుధుఁ డిటు వా
పోవఁగ నగునోయి ? యేమి పుట్టి మునిఁగె నో
యీ ! వారణాసి పురమున
నీవగఁ జింతించువార లెవ రేఁగలరే?

క. ఎపుడో యిక్ష్వాకులనాఁ
డెపు డుండెనో యాంజనేయుఁ డిప్పుడు తత్త్వం
బుపదేశింపఁగ రాఁడని
తపియించుటకన్న వెఱ్ఱితన మది గలదే.

క. ఏనోహరమగు జాహ్నవి
స్నానము గావించి విశ్వనాథుని మదిలో
ధ్యానము సేయుటకన్న ని
దానం బెదియైనఁ గలదె తత్త్వము దెలియన్.

గీ. గురుఁడె కావలెనన్న నీ పురమునందుఁ
గోవిదులు లేరె? వారలఁ గోరి తెలియ
వలసినట్టిది తెలియఁగా వలనుపడదె?
కొండపైఁ గ్రోఁతికిం గూర్చి కుందఁదగునె.

గీ. పార్వతీనాథు నాలయోపాంతమందు
వృద్ధభూసురుఁ డొక్కఁడు వినుచునంట
కర్ణపేయంబుగా రామకథ వయస్య!
పోయి విందము నీమది ముదము గదుర.

క. అనుచు సుశీలుఁడు పలుకన్
జనకుఁడు మును దనకు స్వప్నసంగతుఁ డగుచున్
వినిచిన యర్థం బెల్లన్
మనమునఁ దోపంగ నతఁ డమందముదమునన్.

చ. బళిర!సుశీల! చక్కని యుపాయము దెల్పితి వింతకాలమున్
గళవళ మొందుచుండుటయె కాని యొకప్పుడు సంస్మరింప ని
శ్చలమతి మారుతాత్మజుఁ డజస్రము రామకథావినోదియై
మెలఁగునటంచు నాకల నమేయకృపన్ జనకుండు సెప్పుటల్.

క. పోవలె నెమ్మి నిఁక వా
పోవఁగఁ బనిలేదు పూర్వపుణ్యంబున నీ
భావము నీకుందోఁచెను
బావనిఁ గనుగొంట కిదియె ప్రావ సుశీలా.

ఉ. శత్రుల నార్వురం గెలిచి
శాంతము స్వాంతమునందు నింపి మూ
ర్తిత్రయరూపుఁడై వెలయు
దేశికదర్శనవాంఛగా కిహా
ముత్రఫలాశఁ బోవిడి ముము
క్షువు దాసుఁడు పోయె నంతటన్
మిత్రుఁడు తోడునీడఁగ సమీ
రసుతుం గన నుత్సహించుచున్.

ఉ. ఆ వసుధామరుండు చని
యచ్చట శ్రీరఘురామసత్కథా
శ్రావణతత్పరుండయిన
సాధువు నొక్కనిఁజూచి మ్రొక్కి సం
భావన మొప్ప భక్తజన
మండలియం దిరవంది రాఘవ
క్ష్మావరు దివ్యనామమహి
మంబు మునీంద్రుఁ డుపన్యసింపఁగన్.

క. పాపము లెల్లను బాపఁగ
నోపెడు శ్రీరామనామ ముత్సాహము లో
దీపింపఁ గీరితించుచుఁ
దాపత్రయ మేదఁ దులసిదాసుం డంతన్.

క. పౌరాణికుఁ జేరంజని
గారవమునఁ గేల్మోగిడ్చి కూర్మిసురవర్యా!
మారుతి మాశ్వాసమునన్
వారాణాసి మసలునంట వారి నెఱుఁగుదే ?

గీ. జానకీజానిపాదకంజాతయుగ్మ
మధుకరం బల మారుతాత్మజునిఁగొల్చి
తత్త్వ మెఱుఁగంగ వేఁడెదఁ దాపసేంద్ర
వారిఁ గనుఁగొను నను వెల్పంగదయ్య.

చ. అన విని భూసురుం డను
మహాత్ముల కేరికో కాక యౌనె పా
వని నెఱుఁగంగ నప్పురమ
భాగవతుం డిట నుండునంచుఁ జె
ప్ప నలవియే? రఘూద్వహుని
పావనతారకనామ మెందునే
వినఁబడునట్టి తావులఁ గపి
ప్రవరుం డతఁ డుండు నెప్పుడున్.

గీ. క్రోల్చు నేయెడ వాల్మీకికోకిలంబు
అంగవించుచు నటకుఁ బ్లవంగవరుఁడు
రామసంకీర్తనఫలాభిరతినియతినిఁ
బోవు నహ్వాని నెఱుఁగు ముముక్షు వెవఁడొ.

గీ. ఇచట నచటను వెదుక నీ వేల పోవ
నీదు పున్నెముకలిమి ననిలతనూజుఁ
డీ సదమునందె విప్రుని వేస మొప్పఁ
గానరావచ్చు భక్తాగ్రగణ్య! యనిన.

క. తులలేని సంతసమ్మునఁ
దులసీదాసుండు రామదూతం గనఁగా
గలుగునటంచుం బ్రతిదిన
మలసతలే కరిగి యట ధరామరులందున్.

గీ. వినయమొప్పగఁ మెలఁగుచు వినతిసేసి
యొక్కొకనిఁ జేరి మారుతి యున్నరూపు
నెఱిఁగినను నాకుఁజెప్పుఁడీ కృపదలిర్ప
ననుచుఁ బ్రశ్నింపఁ జొచ్చిన యవసరమున.

ఉ. పావనిఁ జూడ వేడుచు సభా
సదు లెల్లరఁ బ్రశ్నసేసె ద
ప్పా! వనిలోనఁ జూడనగు
వానిని బ్రాహ్మణ సంఘమందు నా

నా వెదుకంగ? నీవెఱుఁగ
వా నరవానరభేద మంచు హా
స్యావిలచిత్తులౌచుఁ బరిహాస
మొనర్చిరి కొందఱయ్యెడన్.

గీ. తీర్థసేవానురక్తి నే తెంచినాము
క్రొత్త యీ యూరు మాకంచుఁ గొందఱనిరి
పుట్టువాడిగ నిచటనే మెట్టినాము
చూడలే దాంజనేయుని జాడయనుచు.

గీ. కొందఱాడిరి మఱియును గొందఱనిరి
మారుతాత్మజుఁ డనఁగ సామాన్యుఁ డొక్క
సిద్ధవర్యుఁడు భువిఁ జిరంజీవియగుచు
సంచరించును స్వేచ్ఛఁ బ్రచ్ఛన్నవృత్తి.

క. అని యిటు లెవరికిఁ దోఁచిన
యనువున వా రెల్లఁ బలికి రైనను దాసుం
డనుదినము విసిగికొన క
య్యనిలాత్మజుజాడ లడుగు నచ్చటివారిన్.

గీ. ఇట్టు లడుగుచు నుండంగ నిదియు నొక్క
వెట్టిగాఁబోలు నంచని మిట్టిచూచి
పలుకరించిన మారాడ భయమ్ముఁ జెంది
తప్పుకొనఁజూచి రంత సదస్యు లెల్ల

గీ. ఇదుగిదుగో మారుతాత్మజుఁ డిదుగో యంచుఁ
గొంతెకుట్టులు గుంపులై వెంటఁబడఁగ
నిజముగా నెంచి నలుదెసల్ వెదకు నతఁడు
గురునిఁ గలియఁగ నాతని త్వర యదేమొ.

మ. నెలతల్ వీఁడటె మారుతాత్మజుని
నన్వేషించు వాఁడంచు ద
వ్వుల బ్రేలం దనుఁజూపుచుఁ గుసగుసల్
వోవంగ నవ్వారి కం
జలి బంధించుచుఁ దల్లులార ! తగవే
సామిీరివృత్తాంతముఁ
దెలుపం గొంకెద రేల నా కనుచు
బ్రార్థించుం గడుం దీనుఁడై.

ఉ. అంతట నొక్కనాఁ డొక
ధరామరు డాతనిఁ జేరవచ్చి యే
కాంతమునందు నిట్లను
మహామతి ! దేశికదర్శనాప్తికై
వంతలఁగూరు వెట్టికలి
వర్జ్య మటంచు నహంకరించు వే
దాంతుల పొంతఁబోవ కిటు
లర్థి భజింతె గురుప్రసాదముఁ.

క. ఆఁకలికి లోఁగ వదిరా!
ఆకలికిఁ లోఁగ విట్టు లాచార్యునకై
యేకాంత మార్తి జెందుదు
వే? కాంతున కంగలార్చు నెలనాగక్రియన్.

గీ. గురుని వెదకుచుఁ గాశికాపురిని బవలు
రేయి యంచని యనక నిర్నిద్రదీక్షఁ
బ్రతిదినంబును దిరిగెదు భక్తవర్య
నీదు వేదనఁ గనఁగఁ గన్నీరు గారు.



క. నిక్షేపస్థల మేమతి
ప్రక్షోభముఁ జెందు లోభివరుస నితరమున్
లక్షింప కిట్లు శ్రీగురు
సాక్షాత్కారంబుపొందె జాలిం బడెదే.

ఉ. మారుతిజాడఁ దెల్పు మహిమం
బది నాకడ లేదుగాని నే
నారసినట్టి దొండు గల
బద్ది వచింతును విన్ము శ్రద్ధమై
పారుఁ డొకండు నిత్య
మిటవచ్చును రామకథానురక్తి నె
వ్వార లెఱుంగ రా సుజన
వంద్యుని గూఢచరిత్ర మింతయున్.

క. మునియో మూఁగయొ మొఱకో
తనలోఁ దానేమొ సంతతము గొణ్గుచు నె
వ్వనితోడఁ బలుకకయె దే
నినిఁ జూడని చూపుతో ననిమిషుండగుచున్.

క. చెవులం గ్రోలిన సీతా
ధవచరితామృత రసంబు ధార లుబుకుచున్
స్రవియించు వెలికి నన నే
త్ర వనజముల జాలువారు ప్రమదాశ్రువులన్.

క. విను రామాయణ మాతం
డనుదిన మిచ్చటకు వచ్చి యతనికి నీపై
ననుకంప గలిగెనేనిన్
వినుచూలి కుమారుఁ డెలియు వెరవగు నేమో?

ఉ. ఎచ్చటనుండివచ్చి యతఁ
డెచ్చటికేగునో కానరాదు దా
నిచ్చటఁ గానిపించు నొరు
లెవ్వరుఁ జేరకమున్ బురాణమై
వచ్చినవారు చన్నపిదపన్
మెలమెల్లనసాఁగి చూచువా
రచ్చెరువంద మాయమగు
నాతని చిత్రమహాత్వ మెట్టిదో.

ఉ. భూసురుఁ డీగతిం బలుక
మోదము పెంపునఁ దాండవించుచున్
దాసుఁడు వాని డగ్గరి
వినమ్రత మ్రొక్కి మహానుభావ! నా
యాస ఫలించునట్టి తటి
యైనదటంచని యాత్మఁదోఁచు నీ
చేసినమే లమేయ మెది
చేసినఁ దీఱునె యెన్నిపుట్టులన్.

క. వారాణసి గూఢుండై
తారకమంత్రంబు సంతతముఁ దలఁచుచు సం
సారము దాఁటించి ననుం
బారముఁ జేర్పింపనున్న మారుతి యితఁడే.

క. మరునాఁడు పురాణము విన
నరుదెంచిన దాదిగాఁగ నాతఁడు మాయా
ధరణీదివిజుని దప్పక
పరికించుచు నదను వేచి బద్ధాంజలియై.

ఉ. ఆతని డాయఁబోయి విన
యంబునఁ జాఁగిలిమ్రొక్కి దేవ! నా
చేతముఁ జేఁతలు న్నుడు
లశేషములున్ భవదీయ పాదకం

జాతయుగార్చనావిధి
నజస్రము నర్పణసేయువాఁడ నే
రీతి ననుగ్రహింతువో
భరింపఁగ లేనిఁక జన్మబంధముల్.

మ. సదసద్వస్తువివేక మేదఁ దరుణీ
సాంగత్యమే స్వర్గమో
క్షదమంచున్ మదనాగమాభ్యసన
దీక్షాతత్పరత్వంబునన్
మదనాగంబటు సంచరించి నిజ
కాంతాబోధితాత్ముండనై
సదయా! లోలత మాని యిట్వెడలి
సుజ్ఞానార్థినై వచ్చితిన్.

చ. వికలుఁడనై యరణ్యపదవీ
భ్రమణంబున డస్సి కూర్కినన్
సకలరహస్యవేత్తయగు
నాజనకుండు కృపార్ద్రచిత్తుఁడై
ప్రకటముగాఁగ నా కలను
వచ్చి సమీరసుతుండు వృద్ధవి
ప్రకులవతంసురూపమున
వాస మొనర్చును గాశికాపురిన్.

మ. నియమం బొప్పగ నమ్మహామహుని
నన్వేషించి యర్థించి య
క్షయమోక్షాప్తికి సాధనంబుఁ గను
వత్సా యంచు బోధించె నీ
దయకుం బాత్రుఁడ రామభక్తవర!
త్వద్దాసుండ శిష్యుండ నె
ట్లయినన్ నన్గరుణింపు మింక నిదె
సాష్టాంగంబుగా మ్రొక్కెదన్.

చ. అనుచుఁ బ్రపన్నుఁడౌ తులసి కా
ధరణీసుర వర్యుఁడౌర! మున్
విననివి నేఁడు పెక్కులగు
వింతలు వింటిమి, మేలుమేలు! పా
వనినటె నేను వృద్ధుఁడగు
బ్రాహ్మణవేషముఁ దాల్చి తత్త్వబో
ధన మొనరింపఁ గాచుకొని
తాలిమి నుండుదు నట్టె నీకునై.

క. కల నిజ మని తలపోయుచుఁ
గలకంఠిని విడచి యిట్లు కాశీపురిలోఁ
గలఁడంచు నొక్కఁ గోరితిని
గలకాలము వెదక వెట్టిగాదే నీకున్.

క. కలకంఠి యగుచు నాథునిఁ
గలకల లాడించుఁ గలహాకంఠి యగుచుఁదాఁ
గలహించు నొంచుఁ బిదపం
గలహాంతరిత యయి కుందు కాంత యెఱుఁగవే.

గీ. కందుకముఁ గ్రిందనడచి చేనందినట్లు
కలహ మొనరించుఁ గామిని కౌఁగిలింప
లీల విరసోక్తులాడు నిల్లాలి విడిచి
సన్యసించుట రసికలక్షణమె చెపుమ.

మ. క్షణికంబౌ తన యీసుఁ బాసి సతి
పశ్చాత్తప్తయై యార్తయై
ప్రణయోద్దీపితచిత్తయై విరహ
భారం బెట్లు సైరించునో
గణియింపందగ విట్టి చిట్టితగవుల్
కాంతామణిం గూడి ని
ర్ఘృణతన్ వీడి గృహస్థధర్మ. మనురక్తి
న్నిర్వహింపందగున్.

గీ. పవననందనుఁ డీరీతిఁ బలుకఁ దులసి
విషయ సుఖజాతములకెల్ల విముఖుఁడగుచు
పరమవైరాగ్యభావసుస్థిరత వెలయ
వినయమున నిట్టుల నుచును మనవి చేసె.

శా. కామక్రోధముఖోగ్రదుష్ట
బహునక్రగ్రాహసంకీర్ణ ని
స్సీమాగాధభవాబ్ధిభంగనిచయోత్
క్షిప్తుండనై డస్సి యో
స్వామీ! యెట్టులొ యొడ్డుఁ జేరితిని
నిస్సారంపు గార్హస్థ్య మిం
కేమైఁజొత్తు విముక్తుఁ జేయఁ దగదే
యీదీను నిప్పట్టునన్.

క. చాలఁగ విషయసుఖమ్ములఁ
గ్రోలితి దేవా! ఋజీషరోమంథం బిం
కేలా? జీవితశేషం
బీలాగునఁ గడపనిమ్ము యేకాంగి క్రియన్.

క. అనుచుం దాసుఁడు వెసఁ బా
వని యడుగులు విడువ కట్టె పట్టుకొనంగాఁ
గనులెఱ్ఱజేసి యాతఁడు
ననుఁ బోనిమ్మనుచుఁ జని ననల్పజవమునన్.

క. మరునాఁడు పురాణము విని
తరలెడు తరుణంబునందు దాసుఁడు స్వామీ!
కరుణింపు మనుచు మారుతి
చరణాబ్జయుగళంబుఁ బట్టె సవినయవృత్తిన్.

మ. తన పాదంబులు పట్టి మ్రొక్కు తులసీ
దాసుం దిరస్కారవా
క్యనికాయంబులఁ ద్రోసినైచి యను
నాహా! దారులం గొట్టు చో
రుని చంపమ్మన నొంతువే మునలి
విప్రుం బల్కఁ గైకొంటకుఁ
ధనమా ధాన్యము యేమిగాఁ దలఁతు
తత్త్వజ్ఞాననిక్షేపముఁ.

ఆ. అనుచుఁ దన్నుఁ దిట్ట ననిలాత్మజునిఁ గాంచి
పలుకుఁ దులసి వినయభాషణముల
బలిమిసేయనోప బతిమాలుకొందును
గరుణఁజూపుమయ్య గురువరేణ్య.

ఉ. దారులు గొట్టనోప జడ
దారులఁ బట్టఁగనోప నాకిఁకే
దారినిఁ జూపువాఁడవో
యతంద్రిత నాగతిఁ బోదు జన్మఖే
దారి యటంచుఁ ద్వత్పద
యుగాశ్రియ మందితినయ్య భక్తమం
దార! యనుగ్రహించి భవ
తారకమంత్రముఁ దెల్పవే కృపన్.

గీ. అనుచుఁ బదములఁ బట్టి సాష్టాంగ మెఱఁగు
తులసి యొడలెల్ల నెత్తుటఁ దోఁగునట్లు
నేలపై నీడ్చి మారుతి నెనపుదక్కి
పట్టువిడిపించుకొనుచు జవమునఁ జనియె.

గీ. తనువునొచ్చిన మనమునఁ దల్లడిలక
తులసి మరునాఁడు చేరి యనిలతనూజు
మ్రొక్కఁబోవఁగ నతఁడు సంక్రుద్ధుఁ డగుచు
రాళ్ల రువ్వెను వాని నిర్దయ వహించి.

ఉ. ఈ విధి నెంత నొంచిన
సహింపుచుఁ బ్రార్థన సేయుచున్న య
ప్పావనశీలు ధీరతకు భావమునం
గడు మెచ్చి బాపురే
యీవసుధాస్థలిం గలిన
కృత్రిమ భక్తి గురూత్తమాంఘ్రి సం
సేవల కంగలార్చు నొక
శిష్యవరేణ్యునిఁ గంటి నేటికిన్.

క. నెట్టినఁ దిట్టినఁ గొట్టిన
నట్టిట్టనకుండ నన్నె యర్థించుచుఁ దాఁ
బట్టిన పట్టున్ విడఁడు
పుట్టింబో వీఁడు ముక్తిఁ బొంది సుఖింపన్.

ఉ. ఇంక మఱొక్క రీతిగఁ
బరీక్ష యొనర్చెదఁ దాళెనేని ని
శ్శంకత వీనిఁ గైకొనెద
ఛాత్రునిగాఁ బరతత్త్వసారముం
గొంకక తెల్పెదన్ గలి
రఘుప్రవరాంఘ్రిసరోజ భక్తి దీ
పాంకుర మీ నిమిత్తమున
నార్యుల దేశమునందు నిల్పెదన్.

ఆ. అనుచు నిశ్చయించి యనుసరించుచు వచ్చు
దాసు మోసపుచ్చ దారిదరిని
యోగశక్తివలన నుద్భవిల్లఁగఁజేసె
రమ్యమైన హర్మ్యరాజ మొకఁడు.

శా. ఆ సౌధాంతరసీమ నొక్క నవలా
హార్వ్యాంది జాంబూనదాం
దూసంశోభితపాదపంకజసము
ద్భూతప్రభామాలికా
న్యాసోల్లుంఠితచంచలానిచయమై
సానందమై డోలికా
వ్యాసంగంబున నున్న లీల నొక
దృశ్యంబుం బ్రదర్శించుచున్.

క. ఆ మదవతి చెంతకుఁ జని
కామోద్రేకంబు మదినిఁ గదిరిన లీలన్
సామీరి మీఱి మేరఁ
బామరత నటించె నాత్మభక్తుఁడు చూడన్.

ఆ. మోహ మాపలేక ముదుసలివిప్రుండు
కరము పట్టి తన్నుఁ గౌగిలింప
నింద్రగోపమట్లు మృదులాంగకమ్ముల
ముడుచుకొనె లతాంగి మోముఁ ద్రిప్పి.

గీ. తనదు కౌఁగిలి విడిపించుకొని నెలంత
కుపితయై యిట్టులను నౌర కొండముచ్చ!
మతిచెడెనె నీకు నీరీతి మానవతుల
బలిమిఁ బట్టంగఁ జూచెదు కలుష మనక.

గీ. పాప మిదియంచు నీమదిఁ దోఁపకున్నఁ
బూవుబోఁడులు నీవంటి ముసలివరునిఁ
గలయఁ గైకొన రన్న వివేకంబు వలదె?
చాపలము మాని నను వీడి చనుమిఁకైన.

గీ. లలన నబలను నన్ను బలాత్కరించు
పాపు నీతనిఁ బాపి గాపాడువార
లేరు లేరొకో యనుచు నయ్యిందువదన
యలఁతఁజెందుచు నిటునటుఁ గలయఁజూచి.

క. తులసిం గనుఁగొని యంత న
తులసంతోషమునఁ జేరి దోర్వల్లికలన్
మెలివైచి యతనిఁ గౌఁగిట
నిలుపుచు నక్కాంత మధురనిస్వన మొలయన్.

ఉ. ఓ నవమోహనాంగ! యిటు
లొంటిఁ గనుంగొని బల్మిఁబట్టి యీ
మానవరూపకేశ మవ
మాన మొనర్పఁగ నున్నవాఁడు కం
టే ననుఁగావ నీ విపు
డదృష్టవశంబునఁ జేరవచ్చి తీ
శానికృపాకటాక్ష మది
చాలఁగ నాపయి నిల్చియుండుటన్.

గీ. అనుచు భీతిలినదివోలె నతివమిన్న
తులసిఁ గౌఁగిటఁ బట్టి యో యలఘుచరిత
నిముసమైనను నేనిఁక నిల్వఁజాలఁ
బాన్పుపైఁజేర్చి నన్నుఁ గాపాడఁగదవె.

మ. అని యభ్యంతరమందిరమ్మునకు
నయ్యబ్జాక్షి కేల్వట్టి దా
నుని బల్మింగొనిపోయి యో యనఘు!

ద్వి తీ యా శ్వా స ము

నను సావృద్ధుని బారిఁ బాపితివి
మానప్రాణముల్ గాచి నీ
కెనయే యెన్నఁబురూరవుం డనుచు
నా హేలాస్య యగ్గించుచున్.

క. మరులుకొని తోడి తెచ్చితి
మరలింపఁగ వశముగాదు మన మింక నీ వా
నరు బారినుండి కాచితి
మరుబారికి నప్పగింప మరియాదయొకో ?

ఆ. అనుచుఁ గౌఁగిలించు నంభోజదళనేత్ర
పైటజార్చి నొక్కుఁ బంటఁ జంట
నిను మదీయబాహుసీవిని బంధింతు
నంచు మదవతి సడలించు నీవి.

ఉ. కామిని యిట్లు పైకొని ని
కామము దాసునిదార్చి శయ్యకుం
బ్రేమము చిల్కుపల్కులను
వీనుల విందొనరింప భావమం
దేమియు సంచలింపక
సమాహిత దేశిక పాదపద్మముల్
ధీమహితుండు లోనిలిపి
తిన్నని యెలున దాని కిటనుక్.

చ. ప్రణయకటాక్షవీక్షణ
పరంపరలన్ మదనాగమోక్తులన్
జనవుల నెక్కసక్కెముల
జాలముఁ బన్ని యెఱేని నీవు న
న్నెనయఁగఁ జూడ కమ్మరో
పరీక్ష యొనర్చినఁ దాళనేమొ పా
వని భజనంబు దక్క నొక
వాంఛయు నిక్కము లేదు నామదిన్.

గీ. అనుచు దాసుఁడు పలికెడు నంతలోన
పెళపెళా యని తలుపులు విరిగి యొరుగ
వృద్ధభూసురవేషి సంక్రుద్ధుఁడగుచు
శయనమందిరమునఁ బ్రవేశన మొనర్చి.

గీ. తులసిఁ గన్గొని వల్కె నో తులువ తెలిసె
నీదు తత్త్వము నేటికి నిశ్చయముగ
నిట్టి కైతవమరయ నెందేని గాని
మేఁక వన్నియ పులియంట నీకె తగును.

చ. పడఁతులవంకఁ జూడనని
పగ్గెలు వల్కితి గొల్తునంటి నా
యడుగులె యెల్లకాలము
మహాశయ! యాశయసీమ నుం డహా

సడలిన నీవితోడ దిగ
జారిన కొప్పు పసందుతోడఁ బైఁ
బడు సతి కౌఁగిటంగనఁగ
వచ్చెఁ ద్వదీయవిరక్తి యిత్తఱిన్,

గీ. అని యధిక్షేప మొనరింప వినయ మొప్ప
దాసుఁ డిట్లను నీదు పాదంబులాన
మదన వికృతి యొకింతయు మదిని లేదు
కాని యిదియేమి మాయయో కానరాదు.

ఉ. పాములవాని మంత్రమున
బంధితమౌ భుజగంబు లీల నీ
కామిని సోఁకినంతఁ దొలఁగంగ
నశక్తుఁడ నైతి నీ విటన్
మామకచిత్తశుద్ధి
కనుమానముఁ జెంది పరీక్ష సేయ నీ
భామియఁ బన్నితేమొ యొక
ముద్దియ నన్నిటు లాఁక పెట్టునే?

శా. ఉర్విన్ మానుషి కిట్టి సాహసము
శక్యంబే కద మెట్లుండు గం
ధర్వాబ్జాక్షియొకో పిశాచియొకో
యీ తన్వంగి త్వత్సేవకై

సర్వస్వంబుఁ ద్యజించి వచ్చితి నికే
సంగంబుఁ గాసంత యే
నోర్వన్ నీ చరణంబులాన
భవదీయుం జేసి నన్నేలవే.

చ. అని తను నిందసేసి వినయంబున
దేశికు మ్రొక్కు దాసునిం
గని వనజాక్షి యీ జరఠ
కాముకునిం గురుఁడంచుఁ గొల్చి నీ
కను పరమార్థ మెయ్యెది ?
యకారణమిట్లు నిన్నుఁ వరించు నీ
మనసిజరాజ్యలక్ష్మి నవమానము
సేయకు మంచు నవ్వినన్.

చ. కని కినుకన్ మరుత్సుతుఁడు
కామిని కిట్లను మాయలాఁడి! మ
త్ప్రణయము లెక్క సేయక
తిరస్కృతి సేయుటెకాక నాదు శి
ష్యుని వలలోన వైచుకొనఁ
జూచెదు మిన్నక నిన్నుఁ కే సహిం
తునె ననుఁ జీరికింగొనని
దోషఫలం బిదె పొందు మిప్పుడే.

౧. నీవు నీ హార్మ్యరాజ మీ నిముసమందె
మాయ మవ్వుదురుగా కనుమాట యతని
నోట వెడలెనో లేదో యా బూటకంపు
లేమయును దాని మేడ హుళిక్కియయ్యె.

౨. అట్లు గురుశిష్యు లిద్ద ఱేకాంత సరణి
మిగుల దాసుఁడు మదిలోన మిగులనబ్బు
రంబు గదురఁగ గురునకుఁ బ్రణతిసేసి
వినయమృదుభాషణంబుల మనవిసేసె.

ఉ. మాయలఁబన్ని శిష్యవర
మాణువు నిట్లు పరీక్షసేయఁగా
నాయమె మారుతీ! త్రికర
ణంబుల మేల్కనియున్న గూర్కినన్
నీయడుగుల్ భజింతు నిది
నిక్కము టక్కరిమాటలాడి నే
చేయునదేమి నన్ గరుణ
జేసి యిఁకైనను స్వీకరింపవే.

౪. అని యడుగులఁబడి యడలెడు
తనశిష్యునిఁ జూచి కరుణ దళుకొత్తఁగ మె
ల్లన లేవనెత్తి కౌఁగిటఁ
గొని వీపునఁదట్టి నిమిరి గురుఁడిట్లనియెన్.

శా. వత్సా! సంతస మిచ్చు నీదు గురు
సేవాతత్పరత్వంబులో
నుత్సాహం బుదయించె నీకు
భవమోక్షోపాయముం దెల్పి సం
విత్సంపన్నునిఁ జేయ నాకుభవుఁ డీ
విశ్వంభరం బొల్చు నీ
యుత్సేధంబున నంచు భక్తులన
సర్వోత్కృష్టతం బొందుమీ.

ఉ. ఎంచఁగరాని రీతుల బ
రీక్ష యొనర్చితి నిన్నుఁ జాల హిం
సించితి వంచకత్వమునఁ
జిత్తవిపాక మెఱుంగఁగోరి శో
ధించితి, సంతసించితిఁ ది
తిక్ష విరాగము శ్రద్ధ భక్తియుక్
గాంచితి నీయెడం దులసి!
కాంచెదు నీవిఁక ముక్తిసంపదల్.

సీ. క్షత్రియాద్ధత్యంబు గడ తేరఁగా జోలెఁ
గట్టించెఁగద మాధుకరముకొఱకు
సామ్రాజ్యగర్వంబు శమియింప జూదమం
దెల్ల సంపద హరియించెఁగాదె
మేటిమగఁడ నన్న మిట్టిపా టఁడగ
ద్రోవది కట్టి యవమతిఁ బన్నెఁగాదె
పౌరుషస్మయ మెల్ల వమ్ముగా గాజులు
పెట్టించి పేడిగావించెఁగాదె

గీ. పార్థసారథి బ్రహ్మతత్త్వంబుఁ దెలుప
విజయునంతటి వాని కివ్విధిని శిక్ష
సేసి శోధించె నాఁగదా శిష్యు నెడల
బంధుమర్యాద లెంతురే బ్రహ్మవిదులు.

ఉ. బంధము భ్రాంతి, మోక్షమును
భ్రాంతి, కనన్ జగమెల్ల విష్ణు సం
బంధము, తన్మయం బిచటి
వ్యాపృతి సర్వము సిద్ధమేల యీ
రంధి సుఖంబు దుఃఖమును
రక్తి విరక్తియుఁ గల్మిలేమియున్
సంధిలుఁ గోరకూరక యె
సాక్షియటుల్ గనుచుండె సిద్ధియా.

ఆ. పద్మనేత్రుఁడే ప్రపంచ పటమ్మునకుఁ
బడుగు పేక యగుచుఁ బరగుచుండు
విస్తరించెనేని విశ్వసంసృష్టియౌఁ
బటముఁ జుట్టఁజుట్టఁ బ్రళయమగును.

శా. సంకల్పించి ప్రయత్నపూర్వకముగా
సాధించినానంచు ని
శ్శంకన్ బొంగకు నీసమర్థతకు
నజ్ఞానంబునం జూడుమా

సంకల్పంబును గార్యశూరతయు
నే చాయఁగా లభించున్ వృథా
హంకారంబున భ్రాంతిలోఁ బడక
గాయత్ర్యర్థ మూహింపుమీ.

గీ. అమల జలపూర్ణమైన తటాకమందు
నుర్విపైఁ దోఁచునట్టి నిమ్నోన్నతములు
సమత సమసినభంగిని సమరసప్ర
పూర్ణమతులందు భేదంబు వొడమకుండు.

గీ. సమరసంబులేని శాస్త్రజ్ఞులకు శాంతి
యబ్బదెపుడు సంశయములె మిగులు
పుచ్ఛశీర్ష భేదబుద్ధినిఁ గలహించు
దానవులకు విషమె దక్కినటులు.

ఉ. అంబుధిలోని తోయములె
యంబుదరూపమునంది ధాత్రి వ
ర్షంబయి వాహినీతతిని
జాల్కొని క్రమ్మఱ వార్ధిఁ జేరు లీ
లం బరమాత్మ జీవుఁ డను
లాంఛన మంది యనేకయోనిమా
ర్గంబుల సంచరించుచుఁ
బరాత్పరుఁ గ్రమ్మఱఁ జేరి ముక్తుఁడౌ.

స్థిరలో స్థిర మెయ్యే దహో
స్థిరమైనను స్థిరమె ? స్థిరులె చింతింపఁగ ని
ర్జరులైన నలువ యైనన్
స్థిరుఁడే క్షణభంగురంబు దృశ్యం బెల్లన్.

. నిన్న నేఁడును రేపునన్ సతము
నిర్ణిద్రంబుగా నే దవి
చ్ఛిన్నంబై యొకఁడౌచు నెల్లెడఁ
బ్రకాశించున్ జగజ్జాలమున్
బన్నన్ బెంపను ద్రుంప నెయ్యది
నిదానం బద్దిగా కెల్ల నా
పన్నం బేసుమి విశ్వమం దిది యె
తత్త్వం బెంత శోధించినన్

అనుచు నీరీతిఁ దత్త్వరహస్య మెల్లఁ
దులసికిం జెప్పి వాయుసుతుండు పిదప
సక్రమంబుగ మంత్రరాజంబు నతని
కర్థి నుపదేశ మొనరించి యనియె నిట్లు.

అ లబీజంబు రేఫ మో యనఘ వినుము
క లబాంధవబీజ మకార మరయ
కై వాప్తున కగును మకార మివ్వి
ర ఖనామంబు బీజాక్షరములుసుమ్ము.

గీ. అగ్నిబీజము కర్మచయంబుఁ గాల్చు
తమముఁ గమలాప్తబీజంబు తలఁగఁజేయు
సరవిఁదాపత్రయముఁ బాపు చంద్రబీజ
మేమి చెప్పుదు శ్రీరామనామమహిమ.

గీ. తారకంబిది వత్స! సంతతము దీని
జపము సేయుచుఁ దీర్ఘరాజముల నెల్ల
సేవ గావించి మఱలి కాశికిని రమ్మ
టంచు సెలవిచ్చి పంపె నత్యాదరమున.

చ. సకలకళాప్రవీణ! బుధ
సన్నుత సాధుచరిత్ర! సద్గురు
ప్రకటిత తత్త్వసార! కవి
వంశ మహోదధి పూర్ణచంద్ర! వై
దికమతసంప్రదాయపరిదిష్ట!
దిగంతవిశాలకీర్తి! నా
స్తికమదహస్తికేసరి!
ప్రసిద్ధమనోహరమంజువాగ్ఝరీ!.

ఇది శ్రీతిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహావిద్యాపీఠ స్థాపనాచార్య
శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్ష లబ్ధ సారస్వతో
పాసనాసాదిత సరసకవితావిలాస శ్రీనివాస కవికృత
గురుభక్తినామక శ్రీ గోస్వామి తులసీదాస
చరిత్రోత్తరఖండ మహాప్రబంధంబునందుఁ
ద్వితీయాశ్వాసము

ఓం మితి శివమ్.

శ్రీ భాస్కరాయనమః

# గురుభక్తి



## తృతీయాశ్వాసము



క. శ్రీభాస్కరార్చననిపుణ! ప
రాభూతాఖిలవిపక్ష! బ్రాహ్మణపక్షా!
ఆభీలభవానలవ
ర్షాభమధురవాగ్విలాస! అవధానివరా!

గీ. తులసి యీరీతి గురువర్యుఁ గలిసి తెలిసి
తత్త్వదర్శనమందు నిస్తంద్రుఁ డగుచు
యోగమున శాంతి నుండ వియోగదావ
తప్తయై మమత గళితధైర్య యగుచు.

ఉ. కూరిమిఁ జేరవచ్చి తన కోరికఁ దెల్పిన ప్రాణనాథు శృం
గారరసాత్మకుం దయితుఁ గర్కశజల్పవిజృంభణమ్మునం
గాఱులువల్కి నిస్పృహునిగా నొనరించి గృహంబుఁ బాపి కాం
తారము పాలుసేసితి వితావిత నాబ్రతు కింక నయ్యయో!

గీ. నాకు నీతోడిదేసుమి లోక మనుచు
నను బహిఃప్రాణ మటు లోము నాథు నకట!
విరసవేదాంతవాక్కుల వెగటుపఱచి
కాన కంపితి నిట్టులే చానసేయు.

గీ. అంగరాగాదిలీల నభ్యంగలీల
రమణు సంగకములను దీర్పంగఁగాని
యంతరంగము దిద్దుట యతివ కగునె
పుట్టె నేటికి నిట్టి దుర్బుద్ధి నాకు.

క. అనుమత కైంకర్యమున మ
గని సేవించుటయె కాక కాంతకు వేఱై
న నియమ మొకండు లేదని
వినియుం జెడనాడి విభుని, వెతలం బడితిన్.

ఉ. ఆపగరానిమోహమున నాపగ నద్దమరేయి నీఁది నా
కై పడరానిపాట్లు పడి కౌఁగిలిఁగోరిన ప్రాణనాథు సం
తాపమెఱుంగకే హృదయదారణముల్ విరసోక్తులాడు నా
పాపముఁదాప మే పగిఁదిఁ బాపుదు నేదిఁకదిక్కు దైవమా.

గీ. ప్రణయమాధుర్య మనుభవింపంగలేక
వెగటుమాటలఁ బ్రియుని నొప్పించుసతికిఁ
జదువ దేటికి? నేటికిఁ జక్కదనము ?
దాని కిహమును బరము వ్యర్థంబుగాదె.

గీ. నీదు దర్శన మబ్బని నిముస మేని
చెలియ ! దర్శయ సుమ్మంచుఁ జేరవచ్చి
యుఱిగవుంగిలి నన్గూర్చు హృదయనాథుఁ
డెట్లు గహనాంతరమ్ముల నేగువాఁడొ.

ఉ. మక్కువమీర నన్ గదిసి మంతన మింతి యటంచుఁ జీరి నా
చెక్కిళులం గరద్వయినిఁ జేరిచి చూపునఁ జూపునిల్పి యో
టక్కరికాన! నీ కనుల డాఁచితి నన్నిఁక నెందుఁబోదునం
చక్కునఁ జేర్చి ముద్దులిడు నా రసికాగ్రణి నేడఁజూతునో.

ఉ. చక్కనిసామి! చెంగలువచాయలఁ గన్నులు జేవురించె నీ
యక్కర యేల? వేగుతఱి మైనను గూరుకురాదె? యన్న నీ
చక్కని మోముచందురుని సన్నిధిఁగల్వలమూయరాదటం
చక్కునఁ జేర్చినన్ని దురనందఁగఁ జేయు ప్రియున్ స్మరించెదన్.

మ. జలకేళుల్ జడకేళులౌ నరయ మెచ్చన్ రాదు నిన్ బాలలో
పలఁ దేలింతునటంచుఁ గేళిసరసిం బాల్నింపి నాతోడ లీ
లల హర్షించుచు నేను శ్రీహరిని బాలా! లక్ష్మివీవంచు నన్
జెలిమిం బేరుటురమ్ముపై నదుము సుశ్రీమంతు భావించెదన్.

చ. రాజముఖీ ! యొకింతఁగఁ బరాఙ్ముఖివైన సహింపఁజాల నా
రాజకళాధరుండు నగరాజసుతార్ధశరీర మంది యే
యోజను సౌఖ్యమందెదునో యూహయొనర్ప నటంచుఁబల్కుని
ర్వ్యాజకృపాపయోనిధిని భావమునన్ సతతంబుఁ గొల్చెదన్.

మ. ప్రణవంబై ప్రణయప్రదీపకమునై భాసిల్లు త్వద్గాత్రని
స్స్వనపీయూషము గ్రోలఁ గల్గుతటి భోజ్యం బన్యమేనొల్లనో
ననఁబోఁడీయని భక్ష్య భోజ్యచయమున్నానోటికందించు న
య్యనుకంపానిధిఁ బ్రాణనాథు మదిలో ధ్యానింతు నెల్లప్పుడున్

శా. సీమంతంబునఁ జేర్చి యేచరణరాజీవంబులం బేర్మిం హ్రీ
త్రీమంజిక్కఁగఁబట్టి ముద్దుగొనియక్షిద్వంద్వమందద్దు కొం
చే మూర్ధ్వంబుచు సంతసింతు నవి నేఁడే దుర్గమారణ్య మం
దేమార్గమ్ముల గాసిఁజెందెదునో? నే నెందేగుదుగా దైవమా.

మ. ఉపధానం బితరంబు నొల్లనని నాయూరుద్వయిన్ మస్తకం
బుపగూఢంబొనరించి యో చెలియ! రంభోత్సేకముం బాపితం
చుపలాలించుచు విశ్రమింతు విపుడయ్యో ఘోరకాంతారమం
దుపల శ్రేణిపయిన్ శయింపఁగల వేయోజాక్ష మనోనాయకా!

చ. కలపము నామెడందఁగులుకం గమకింపఁ ద్రపాభరంబునన్
వలదని నే బెనంగుతటి బంగరుగాజులు తన్ను గీరఁగాఁ
గళవళమందు నన్నుఁగని కంతురణం బిది కాదెయంచుఁ గ
న్గొలుపు రసజ్ఞశేఖరునిఁ గూర్చి భజించెద నెమ్మనమ్మునన్.

ఉ. స్థాణువొకండు త్వచ్చరణతాడనభాగ్యముమై నశోకమై
నా నెమ్మెపంగి నిన్నుసు మనస్సునఁ బూజయొనర్చుచుండనో
ప్రాణసఖీ! త్వదీయపదపల్లవ మొల్లక వేశ్యఁగూడు పా
షాణసమున్ననుం గరుణసాఁకుమటన్న ప్రియున్ స్మరించెదన్.

ఉ. స్థవిరరసాలముక్ సఫలతంగను నీ చెయి సోఁకినంత శా
స్త్రవిధినిఁ ద్వత్కరగ్రహణసత్కృతిఁగాంచితి శంకలేదు పు
ట్టువు సఫలంబు నాకని కడుంగడుఁ బ్రేమ్మని గారవించు సా
త్మవిభు మనోహరాంగు సతతంబుస్మరించెదమానసంబునన్

ఉ. అంటకు మంట న్యాయమొకో ?
యూదటఁ బైకొన నించు కంత గో
రంటినఁ గోపమేల ? యిటు
లాఁక నను న్నిలుపంగ నేను గో
రంటనె ? కౌఁగిలీఁ గదవె
ప్రాణసఖీ ! యను నాదు పున్నెపుం
బంటను బ్రాణనాథు మది
భావనసేసి భజింతు నర్థిమై.

చ. ఇది తగునే చెలీ ! పొగడ
కిత్తువు నీ ముఖసీధు వేను నీ
పదముల చెంతఁ జాటుశత
వాక్యములం బొగడం గడంగినన్
బ్రిదులఁగనీవు నీవి పిరుపీకున
నానఁగనీవు మోవియం
చదవదఁబల్కు నాదుపొల
యల్కను బాపు ప్రియున్ స్మరించెదన్.

చ. సిరియొసలారు మేలిమి ప
సిండిమిసం గొమరంది చందనా
గరుమృగనాభిలేపనసు
గంధిలమై సుకుమారమై మనో
హరమయి నా యురమ్ము పయి
హాసున నొప్పెడు మేను ధూళిధూ
సరితము ఘర్మసిక్తము న
సంస్కృతమై యెటఁగాసిఁజెందునో.

ఉ. పల్లవకోమలంబులయి
పయ్యెదపై నెదపై వసించి నా
యుల్లముఁజల్లఁజేసి ప్రణ
యోర్మ్మల లీలగఁ దేలి తేల్చు మ
ద్వల్లభు పాదపద్మముల
భావమున న్నెలకొల్పి కొల్తు నే
నెల్లపుడెల్ల లేని దగు నీ
విరహాబ్ధిఁ దరించి మించఁగన్.

ఉ. తామరసాభమై యభయ
దానమనోహరమై మృదంగవీ
ణామృదునాదమేదుర మ
నర్ఘమునై బహుపూర్వజన్మ సం
యామఫలస్వరూపమయి
యబ్బిన నాథుని హస్తమెంతు ని
స్సీమ మగాధమౌ విరహ
సింధువునుండి సముద్ధరింపఁగన్.

స్వానుభూతిఁగనక మానాథుఁ డని మ్రొక్కి
ప్రతిమఁగొలుచు భక్తవరుస నీదు
చిత్రపటము నెంచి చిత్తంబులోఁబాలు
ద్రావ వలసె నాకుఁ బ్రాణనాథ.

మన్ననలం గవుంగిళుల మన్మథలీలల నర్మభాషలన్
నన్నుఁగరంచి యేలుకొను నాథునిఁ గానలకంపి తొంటిసౌ
ఖ్యోన్నతులం దలంచుకొననుత్సవమయ్యెడునొక్కొ చేతిలో
వెన్నను బారవైచుకొని వ్రేళ్ళను నాకికొనంగ నేమగున్.

నిలుకడఁగానక నాథుం
డిలువెలువడి విపినముల నిరీహం జనుచున్
బలుసంకటముల కోర్వఁగఁ
జలియింపక యింటనుండఁ జనునే నాకున్.

అపుడే పాదములందు వ్రాలి, చనునే యర్ధాంగి నన్వీడ, నా
యపచారంబును సైపుమింటనిలు లేదా వెంటఁగొంపొమ్ము, నీ
తప మే నాగను జేతనైనయటు నీ దాస్యంబుఁగావింతు నం
చ[illegible]డే మొంకుల కేడ్వనై తి నిపు డేమందుం గుబుద్ధింగటా!

ఆ[illegible]రింతు వేడినీ రవగాహనార్థంబు
ప్ర[illegible]నమ్మ్రను నీకు బ్రాహ్మ వేళ
ర[illegible] దేవతార్చనకు యోగ్యములైన
గ[illegible]మా[illegible]్యంబుల బంధురముగ

నాయితం బొనరింతు నతిథిదైవతనివే
దనమున కెలమి నోదనములాది
నపనయించెదను యోగాసనక్లేశంబుఁ
గూర్మిఁ బాదము లొత్తి కుతపవేళ

గీ. నుపచరింతును నీ మనసొప్పునట్లు
కోరఁదగనివి యెయ్యవి గోర నెపుడు
నన్ను నీవెంటఁ గొనిపొమ్ము నాథ యనుచు
జాలిపుట్టఁగ నే బతిమాలనైతి.

గీ. ఇంటియాతనిఁ గానల వెంటనంపి
యిల్లు దీర్చెడు నిల్లాలి యేవ బ్రతుకు
నా నొసటఁ బ్రాసెఁ గాబోలు నలినభవుఁడి
కెందుఁ బోవుదు విభుఁగాన నిప్పుడకట.

ఉ. ఈవిధి విప్రయోగమున
నెంతయుఃజింత వహించి నిద్దురం
బోవిడి తాప మెచ్చఁగ బు
భుక్షయు వీడి మదిన్ వియోగగీ
తావళి నాలపించుచుఁ గృ
శాంగి దినంబులు నెట్టుచుండఁగా
నా వగఁ జూడలేకను న
యంబున నిట్లను రత్న యంతటన్.

చ. ఇరువురమేకమై తులసి నిల్వోడలించితి మిప్పు డూరకే
పురపురం బొక్కినం గలుఁగబో దొకయింత ఫలంబు గాశికా
పురిఁ దన తండ్రిజూచుటకుఁ బోవునతండనియెంతు నింక నీ
యఱిమురి యేఁటికే మనము నచ్చటికే చన నొప్పువై శమే.

క. వానప్రస్థాశ్రమమునఁ
దానును దన తండ్రి తపము తపియింపఁగ సా
ధ్వీ! నీవు నేను వారికి
మానుగఁ బరిచర్యచేసి మనఁదగు శాంతిన్.

ఆ. అనుచు నత్తపల్కె నౌనని మమతయు
మనసుఁ జిక్కఁబట్టి మగనిఁ గలియ
నాస ప్రోత్సహింప యాత్రకు వలసిన
వస్తువసుచయంబు భద్రపరచి.

గీ. శుభముహూర్త మరసి సుదతి యంతట నత్త
వెంటరాఁగ నిల్లు వెడలె విభుని
మోముఁ జూచుకోర్కె మది సందడింపంగ
నేఱు జలధి గుఱిచి పారునటులు.

శా. ఆ సౌందర్యవతీవతంసము ల
సూర్యంపశ్యలై యుంట నే
మో సాలాది మహీజ
గుల్మలతికా వ్యూహప్రకీర్ణాటవీ

దేశాధ్వంబుల నాత్మశోక
దవహేతిన్వాతమే మార్గముల్
వాసింజూపఁగ సాగిరంత
వనసత్వ్రశ్రేణి లెక్కింపకే.

ఆ. ఇల్లు వెడలనట్టి యిల్లాండ్రు రిద్దఱు
కల్లుముల్లునాక యెల్లపాలము
మెట్టి యెట్టకేల కెట్లొ చేరిరి కాశి
కాశ నిలువఁబెట్టి నసుచయంబు.

గీ. కాశి కక్లేగి యట జితకాము లగుచుఁ
గామముఖశత్రువర్గంబు గర్వముడిపి
శాంతి విహరించు సంయమిజనులఁ గాంచి
విభులజాడల నడిగి రవ్వేలఁదులంత.

గీ. ఆత్మజునిఁగాని యొక్కెడ నాత్మవిభుని
గాని కానక రత్న యమానశోక
మంది యక్కట! నేనింత మంద భాగ్య
ననుచుఁ గలనైన నెప్పుడు దలఁపనైతి.

చ. అనఁగి పెనంగి చింత యిసుమంతయినన్ మదిఁజేరనీక బల్
చనవులఁ గోడలుం గొడుకుఁ జక్కెర విల్దొరరాజ్యమేలఁగ
న్గాని సహింపలేనియటుఁ గోడలి బల్మినిఁ బుట్టినింటికిం
బనిపితి దానఁబాటిలె నుపద్రవ మిట్టు లికేమి సేయుదున్.

ఆ. తనయునందుఁ జూపి తపమేగె విభుఁ డప్పు
డరిగె సుతుఁడు వార్తయైనఁ దెలుప
కకట! కులము నిలుప నంకురం బైనను
గానిపింపదెట్లు గందు శాంతి ?

గీ. చింత యీగతిఁ జెంది కృశించె రత్న
క్షుధ యెఱుంగదు మెతుకైనఁ గొఱకదెపుడు
తొడరి బాష్పాంబునిధిఁ దొప్పదోఁగుచున్న
నలతి జఠరాగ్ని యెట్లు చల్లారకుండు.

ఉ. అంతట నొక్క వేకువ మహాపురుషుం డొకరుండు పొల్చి స్వ
ప్నాంతరమందు ప్రీతియొసలారగ నిట్లని రత్నఁబల్కు నో
కాంత ! త్వదీయపుత్రకుఁ డఖండమనీషను దత్త్వవేత్తయై
శాంతిఁ జరించువానికయి స్వాంతమునందిగులొందకిమ్మెయిన్

గీ. ఆంజనేయుని శిష్యుఁడై యనఘు డతఁడు
దాంతి శాంతియు గని పరతత్త్వ మెఱిఁగి
భ్రాంతిరహితాత్ముఁడగుచుఁ దీర్థములఁ జూడ
దక్షిణాపథమందు నిత్తఱిని మెలఁగు.

గీ. సాధుజనముల కెల్ల నాశ్రయ మొసంగ
జాహ్నవీతీరమున ధర్మశాల యొకఁడు
మమత నిర్మించు నటకు నామహితచరితుఁ
డెలమి నేతెంచి యాపెకు నిచ్చు శుభము.

గీ. తరుణి ! నీపతి పరమపదంబునందెఁ
జనఁగ నీకును గాలమాసన్నమయ్యెఁ
జెడెను గొడుకని యెడఁద నీ వడల బోకు
మతనికీరితి ప్రాఁకు దిగంతములకు.

చ. కలనిటు లామహామహుఁడు కాఁగలవెల్ల నెఱుంగఁజెప్పనా
కులపడక వ్వాలంది తన కోడలికెల్లను దెల్పి బుద్ధి ని
శ్చలముగఁజేసి శ్రీశపదసారసయుగ్మమునందు నిల్పి హం
సలఁగుదియించి లేపి నిమిషంబునఁబాసె శరీరమంతటన్.

గీ. మామ యేనాఁడొ యిలువీడి మాయమయ్యె
నత్త యీనాఁడు దనుఁబాసి యరిగెనిట్టు
లున్న పెనిమిటి యూరార్ప నొద్దలేఁడు
వారణాసిని మమత కెవ్వారు దిక్కు.

గీ. ఒదలు శోకాగ్నికాప్తుల యూరడింపు
లాజ్యమై మాటిమాటికి నడలుపెంచుఁ
గట్టె లెగఁద్రోయకుండినఁ గాలికాలి
యారు నిప్పటు లేకాకియార్తి తీరు.

గీ. మమతయెట్లెటొ తనదు నుమ్మలికమార్చి
యత్త తెలిపిన స్వప్నవృత్తాంత మెంచి
యాశ యుత్సాహ మిడఁగ జాహ్నవితటమున
ధర్మశాలనుగట్టె నిస్తంద్రబుద్ధి.

గీ. పాలుచర్వటు లన్నంబు పంచదార
పండ్లుకాయలు, దుంప లెవ్వరికి నేమి
వలయునో తానె స్వయముగఁ దెలిసికొనుచుఁ
దన్వి నిరతాన్నదానతత్పరత నుండు.

సీ. బైరాగులకు నన్నపానీయము లొసంగు
సన్న్యాసులకు భిక్షసలుపు భక్తి
బీదసాదలకిచ్చు విత్తంబు మొత్తంబు
కన్నెపిల్లల పెండ్లి కన్ని యిచ్చు
పండితజనుల సంభావించుఁ దగురీతి
విద్యార్థులను బెంచు బిడ్డలట్లు
వ్యాధిపీడితులకు వైద్యంబు సేయించు
నాపన్నజనముల నాదరించు

గీ. నన్నపూర్ణయె యీ పె రూపందెననుచు
సకల జనములు వేనోళ్ల సన్నుతింపఁ
దరుణి విశ్వేశ్వరుని రాజధానియందు
ధర్మసత్రము జరిపె సద్ధర్మవృత్తి.

సీ. కలదేమొ విశ్వేశుఁ గానఁగా నేగని
వీరవైష్ణవభక్తవితతి కొంత
కలదేమొ మాధవు గానఁగాఁ బోవని
లింగధారణసేయు జంగమతతి

కలరేమొ కొడిసిఁ గానంగబోవని
శ్రోత్రియాహంకారరూక్షమతులు
కలదేమొ వ్యాసుని గానఁగాబోవని
తనుపాటవాపేతతైర్థికాళి

గీ. వారణాసికిఁబోయిన వారిలోన
మమత సత్రంబుఁగానని మానవులును
భక్తి నాపెకు మ్రొక్కని పంచజనులు
మందునకు లేర యాయమ్మ మహిమ యేమొ.

సీ. అరుణోదయము వేళ సురనదీజలముల
నఘమర్షణస్నాన మాచరించి
ప్రణుతించి యన్నపూర్ణాసనాథుని విశ్వ
నాథుని శుద్ధజాహ్నవినిఁదేల్చి
జ్ఞానవాపీతీర్థపానంబుఁ బొనరించి
విఘ్ననాయకునకు వినతిసేసి

గీ. భోజనానంతరమునందుఁ బుణ్యకథలు
వినుచుఁ దనుఁజూడవచ్చిన వనితలకును
అన్నపూర్ణను బొగడి సాయంతనమున
రాత్రి స్థండిలశయనయై రమణుఁ దలఁచు.

సీ. దర్శన మొసంగునే నాదు దయితుఁడింకఁ
బలుకరించిన నిచ్చునే ప్రతివచనము

నారగించునె నేను భోజ్యము లమర్ప
బుద్ధిఁదలఁపోయునో కొంత పూర్వమైత్రి.

ఉ. అధిపుఁ డక్కటా! తాఁ దురీయాశ్రమంబు
స్వీకరించిన నెట్టు లూరీకరించు
నాదుదాస్యంబుఁ? గలదె సన్యాసిపత్ని
బ్రతుకుకన్నను ధర దురవస్థ తలఁప.

సీ. శాక్యమునీంద్రుఁ డొక్కత్రుటి
సంసృతివీడి యతీశుఁడై మహా
వాక్యగతార్థముల్ మదిని
భావనచేసి మెఱింగి బుద్ధుఁడై
యైక్యసమాహితాత్ముఁడయి
యాసల నెల్లఁ దిరస్కరింపఁగా
శక్యముగాదొకో యతని
జాయకుఁ బ్రాణముల్ భరింపఁగన్.

చ. పతి కొక ముద్ద పెట్టని
యభాగ్యను నిత్యము ధర్మశాలలో
నతిథిసహస్రమున్ బహు
విధాన్నముల్ దనియింపఁ జేసి స
ద్గతి యిఁక నెట్టి దేమ గనఁగా
గలరో మెఱుఁగంగఁజాల మ

తత్కృత మిది యెల్ల వ్యర్థమె పతి
న్ననుఁగూర్పఁగ లేని దైనచోఁ.

క. గంగాతీరంబుననో
గంగాధరునాలయంబు కడ సాధులు స
త్సంగతిఁగూడెడు నెడనో క
నంగా లభియింపదొక్కొ నాథునటంచున్.

గీ. క్షణమె యుగమట్లులై మదిఁ గలతబఱచ
నింతకాలము నకట నిరీక్షసేయు
దాన నిఁక నెన్నటికి నాదుదయితుఁ జూతు
ముందుగతియేమొ మదిఁదలపోయరాదు.

జ్ఞానగంగాస్నాన కలనఁ దేలెడు వాని
కఘమర్షణస్నాన మవసరంబె ?
యనయంబును శివోహ మనెడు నిష్ఠ నెసంగు
యతికి నేమిటికి లింగార్చనంబు
దృశ్యవిరహితమౌ స్థితి నుండు కేవలుం
డితరసంగంబేల యిచ్ఛయించు
నానందభుక్కున కర్థింప నేటికి
సత్రభుక్కులతో పసాపడంగ

గీ. కల జగంబను ప్రజ్ఞానఘనున కరయ
వారణాసిని నివసింపఁ గోరనేల

యాంజనేయుని శిష్యున కతివయేల
మమతవీడిన వానికి మమతయేల?

గీ. ఎప్పుడెవ్విధి నెచ్చట హృదయనాథు
పాదయుగ్మంబు నానందబాష్పవారిఁ
గడిగి యాతిథ్యమొసఁగు భాగ్యంబు నాకు
నలవడునో తెల్పఁగదవమ్మ యన్నపూర్ణ.

చ. కలుగును పుత్రుడెందయినఁ
గల్గదొకప్డు కుమాతయంచుఁ బె
ద్దలు వచియింతు రయ్యది
యథార్థమకా నెఱ నమ్మి త్వత్కృపా
విలసనలబ్ధి వేచి విలపింతును
ద్వద్విపరీతచర్య కం
జలి ఘటియింతు నానుడి న
సత్యము చేయకు మంబ నా యెడన్.

ఉ. పిన్నలు పెద్దలంచనక పేర్చుమదోద్ధతి మీఁదిమీఁదికిం
గ్రొన్ననవింటిజోదరుగఁ గోపమునం దహియించెఁగాని నీ
సన్నిధి సమ్మతింపఁడొకో శాంతి సపర్యల స్వీకరింపఁడో
నిన్నె వరింపఁడో శివుఁడు నీదృఢభక్తికి మెచ్చి పార్వతీ.

ఉ. ఈవిధిఁ జింతనై సతి నిజేశుని
రాక నిరీక్షసేయ వా
ణీవిభుఁడో యుపేంద్రుఁడొకో
నీలగళుండొ యటంచు నెల్లరున్
భావములందు నబ్బురము భక్తియు నం
దిన మస్కరింపఁ దే
జోవిభవాభిరాముఁ డొక
సుందరుఁ డంతట నొక్క ప్రొద్దునన్.

క. శ్రీరామమంత్ర రాజము
వారక జపియించు చుం బ్రపంచముఁ గనన
ట్లూరక సత్రములోపలి
ద్వారమున న్నిలువఁగాంచి పడఁతి యిటు లనున్.

చ. మునివర! పూర్వజన్మ కృత
పుణ్యవిపాకముచేఁ ద్వదీయ ద
ర్శనము లభించెఁ ద్వచ్చరణ సారస
దాస్యఫలం బొసంగుచున్
మనసుననన్ని నాళ్లిట
సమాహితులై తమ రుండవచ్చు సా
ధునికరసత్ర మిద్ది భవ
దుఃఖితుఁడా గృహియిల్లుగాదనన్.

సీ. సాధుచంద్రుఁ డన కేమేని జ్ఞప్తిపథము
దగిలెనో యొక్క త్రుటిమాత్ర స్తంభ మొదవ
నట్టె నిశ్చలగాత్రుఁడై యాననంబు
వంచి యాలోచనావిలభావుఁ డగుచు.

చ. వలచుట దోష మొల్ల నను
పట్టును దప్పె తలంపు లేక ము
క్తులు విధి చొప్పుఁ బట్టి
సమకూడిన వెల్లను సమ్మతింతురన్
బలుకులు మున్ను దేశికుఁడు
పల్కిన వాని స్మరించి యాత్మలో
నోలయు వికల్పమూగి తల
యూపుచు సమ్మతి సూపి యంతటన్.

సీ. అమరనదికేగి స్నానసంధ్యలను దీర్చి
యన్నపూర్ణను దర్శించి యనఘుఁడాతఁ
డచ్చపుం భక్తితోడ సాష్టాంగ మెఱగి
యాత్రిపురసుందరిని నిట్టులని స్తుతించె.

శా. అమ్మా దుర్గ! నినున్ భజింపక యె
వేదాంతమ్ములన్నేర్చి లో
కమ్ముల్ మిథ్యలటంచు నెల్లెడలఁ
బ్రజ్ఞావాదముల్ సేయుచుం

దిమ్మిన్ బ్రహ్మిగ బ్రహ్మిఁ
దిమ్మిగ సమర్థింపఁ దొరంకొంచు వా
దమ్ముల్ సేసిన శోక
మోహరహితాద్వైతంబు సిద్ధించు నే?

ఉ. ఆర్జవ ముండెనేని వివిధా
ధ్వరదీక్షలఁ బూనెనేని వి
త్తార్జకుఁ డయ్యెనేని నిగమా
ర్థము నెల్ల నెఱింగె నేనియుం
ధూర్జటిరాణి! నీవు కృపతోఁ
దిలకింపవయేని మానవుం
డూర్జిత తత్త్వదర్శన
సమున్నతిమై సుఖయింప నేర్చునే.

మ. ఇది నాకిష్టముగాదు నాకు నిదియా
హేయంబటంచెంచి యి
య్యదియే నామది కింపు నింపు
నిది గ్రాహ్యంబంచుఁ గాంక్షించి యె
య్యది వర్జింతును స్వీకరింతు నెది?
లోలాత్మండనై యెన్నఁగా
నిది యెల్లన్ భవదీయరూపమె
కదా! హేమాద్రి సంస్థాయినీ.

శా. శ్రీశానీ ! యరిషట్కముం
గెలువ నెంతే ధీరతం బోరి త
న్నాశంబుం బొనరించినాడ నని
యానందించు నాలోన నా
వేశించుం గద రక్తబీజు నటు
విద్విడ్వ్రాత మేపారి యీ
క్లేశం బేదగ నాదునాల్క
ననురక్తి న్నీవు న ర్తింపుమీ.

చ. ఉదరపరాయణత్వమున
నున్నవి లేనివి యెన్నొ పన్నుచుం
బదురులమంచు నెల్లెడలఁ
జాటుచు ముగ్ధుల మ్రొక్కులంది కో
విదులఁ దిరస్కరించి యన
భిజ్ఞులె యయ్యును ధర్మశాస్త్రలై
వదరెడువారి కీరితిని వాంఛ
యొనర్పు హిమాద్రికన్యకా !

ఉ. ఊసరవెల్లి వర్ణముల
యొప్పునఁ జిత్రవిచిత్రరీతులన్
భాసిలు తోలుబొమ్మలఁ బ్ర
పంచమునన్నటించుంపఁజేయు దీ

వేసములెల్ల నిక్కమని
వెక్కలిమానిసు లెంచి మించుపే
రీసున నిక్కినీల్గి కల
హించి నశింతురు దేవి! వ్యర్థులై.

క. ఋషివరమానసహంసీ!
విషమాంబకవామభాగవిశదశుభాంగీ!
ఉషితాఖిలాఘనిచయా!
సుషమాపరిహాసితసర్వసురయువతిచయా.

క. ఋూనిర్జితేంద్రనీలమ
ణీనికరా! ముక్తిదాననిపుణమృదుకరా!
శ్రీనాథ పద్మజాదిసు
రానీకనిషేవితచరణాంభోజయుగా.

క. ఌసుఖముఁగోరఁగ నేమిటి
కి సుకృతమది క్షీణమైనఁ గ్రిందికిఁబడి దు
ర్వ్యసనములఁ జిక్కనేల గి
రిసుతా! నినుఁగొల్వ నీవె శ్రీగళుపదవిన్.

క. ౡారాజ పుత్రిశక్తియు
నారయఁగా శక్తిమంతుఁడగు నాతండున్
వేరగుదు రెట్టు లెఱుఁగని
వారలు వేరడముసేసి భ్రమియింతురిలన్.

ఉ. ఏయెడనో సుమేరు గిరి
శృంగమున న్వసియింతు వంచుఁ గా
త్యాయని! యేల నిన్వెదుక
నారయ నెచ్చట లేవు నీవె కా
వే యినుకాంతి హవ్యవహు
వేషి సుధాంశుని వెల్గు వేయు నే
లా యెది దేనిశక్తియని
యందు రదెల్లను నీవెకావొకో.

ఉ. ఐశ్వర్యాష్టక సిద్ధిపొంచె
హఠయోగాభ్యాసముల్ సేయుచుఁ
నిశ్వాసింపఁగనేల? దానఁ
గలుగుఁ లేకుండు విశ్వేశ్వరీ!
విశ్వంబెల్ల విహాయసాధ్వ
గుని దృగ్వీధిగతంబౌనటుల్
విశ్వాసంబున నిఁ భజించి
నను రావే యన్నియుంగోరకే.

క. ఓడరు రిపుషట్కమునకుఁ
వేడరు ధనకాంక్ష నంబ! పృథ్వీపతులం
బాడరు నరమాత్రులఁ గొ
ల్వాడరు సభలందు నీదు నంతేవాసుల్.

క. ఔదాసీన్యము ముక్తి
శ్రీదాయకమని యుపన్యసించు విబుధులే
లేదని రాదని విషయసు
ఖోదయమున కంగలార్తు రుమ! నీమాయన్.

ఉ. అంబ! గజాజినాంబర హృ
దంబుజవాసిని! భక్తబర్హికా
దంబిని! రక్షితామరని
తంబిని! కల్పిత సర్వవిష్టపా
లంబిని! దుష్టమోచన వి
లంబిని! లాలిత కార్తికేయహే
రంబ! విషాదసమ్మదక
రంబిత సృష్టికదంబ! కావవే!

గీ. అస్తగిరిఁజేరు నినుఁ డుదయంబుఁగనఁడె
రాదె యమవస పిమ్మట రాక తిరిగి
కలిమి లేములు నీమాయ కలిమి నంబ
తిరుగుచుండు ఘటీయంత్రసరణి ధరణి.

చ. కమలజపద్మనాభ శితి
కంఠులె నీదు ప్రభావ మెన్న న
క్షము లన నేను పూనుటది
సాహసమంచని కొంకి ఋషుచం

ద్రములకుఁ గల్గు భేద మిన రశ్మి
సమక్షమునం దగణ్యమౌఁ
జుమియని పూనితిం ద్రిపుర
సుందరి! నన్ క్షమియింపవే కృపన్.

చ. ఖగపతి యాదిశేషుఁడును జ్ఞాతి
విరోధము విస్మరించుచున్
నగధరుసేవఁ జేయుదు రనన్య
సమాహిత చిత్తులౌచు నో
జగతి నహంకృతిన్ మమతఁ
జంపఁగ మార్గము వేరయున్నదే
యగజ ! మహానుభావచరణాం
బుజసేవయెగాక యెన్నఁగన్.

చ. గగనగన నాత్మలోపల న
ఖండముగా వెలుఁగొందునే దనిం
ధనమయి మోహసంతమస
దారకమౌచుఁ జిదగ్నినాఁగ నం
దనయముఁబృథ్విఁ దొట్టి
త్రిపురాంతకు దాఁకను వేల్తు విశ్వ మె
ల్లను బరిధూత భక్త నిగళా!
బగళా! శ్రితలోకమంగళా.



చ. ఘనతవహించి తిగ్మకరు
ఘర్మముఁబాపుచు ధాత్రికెల్ల జీ
వనమునొసంగు మేఘుఁగడుఁ
బ్రస్తుతిసేయఁ డెవండు దానెయై
స్తనితమిషంబునం దన ప్ర
థన్ జగమెల్లెడఁ జాటనేల? యా
త్మనుతిపరాయణత్వమును
మానఁగలేరుమ! యెంతవారలేన్.

క. ఔమ్మన నంజనమగు లో
కమ్మున నిక్షేపములను గన నదియగు మో
క్షమ్మునకు న్నిధివౌ ని
న్నమ్మరో! మనుజుండు గను నిరంజనుఁడగుచున్.

చ. చతురత నీ ప్రభావమును
సన్నుతి సేయఁగ శబ్దశాస్త్రవే
తృత నెర సున్న నా నెరసు
లెన్నక నిన్ బొగడించుకొమ్మ నీ
వె తగిన పల్కునేరిపి మ
హేశ్వరి! బిడ్డకు నత్త తాత, యం
చితముగ నమ్మ, యంచు జన
యిత్రియె నేర్పునుగాదె మాటలన్.

ఛత్త్రాధిపత్య మబ్బిన
సుత్రాముని వైభవంబు చొప్పడినను దా
పత్రయముపోదు లోకస
విత్రీ! కడగంట నీవు వీక్షింపవయేని.

జలనిధిలోపలఁ బుట్టిన
యలలందే పెరిగి విరిగినట్టులు జగముల్
కలుగుచు మెలఁగుచు నీలో
పలనే కలియుంగదమ్మ ప్రళయమునందున్.

వృషకేతనునకు లొంగని
విషమాంబకు సొంపుఁ జేసి వీఁక నతని పౌ
రుషమును సగముగఁ జేసితి
వృషితసుమేషునకు జీవమొసఁగితి వంబా.

ఇమ్మను నేకాక్షర శ
బ్దమ్మది భయకీర్తులందు వర్తిలు నా ద్వం
ద్వమ్మునఁ దగులం డద్వై
తమ్మగు తత్త్వమ్ము నెఱుఁగు ధన్యుండంబా.

టక్కులు కొన్ని నేర్చి కపటమ్మున నైజగుణమ్ము డాఁచి తా
నెక్కుడు దైవభక్తి నటియించుచు లోకుల మోసపుచ్చినన్
దక్కునె వానికిన్ భవదుదాత్తపదం బుమ! గూఢసాక్షిణీ
ఫక్కిని సర్వచిత్తముల వర్తిలి వాస్తవ మీవెఱుంగవే.

చ. రవరవసుంత లేకయె హుటాహుటి
మింట జరింప నేర్చినన్
భువనచయంబు నెల్ల నలవోక
భ్రమించినఁ గామరూపుఁడై
భవదవతాపమారును
భవాని మనుష్యున కెట్టు లాజవం
జవమిది నీదు మాయ యని
స్వాంతమునందుఁ బ్రశాంతిఁ జెందఁడేన్.

చ. డమరువుపాటిఁ జేయదె
మృడాని! భవత్పద భక్తుగాత్ర మా
ప్రమథగణాధినాథునకు
వాద్యవిశేషముగాఁగ దీని నీ
వమరిచి తన్ముఖమ్మున
సమంచితరీతిని శబ్దజాలముం
దెమలుచు మమ్మ మిమ్ము
వినుతించెద నెప్పుడు వేయినోళ్లతోన్.

క. ఢక్కాప్రయోగించుచు నా
మక్కంటి సమస్తలోకములు ప్రళయమునన్
మక్కుఁగఁ దాండవ మొనరుప
నక్కా మిగులుదువు నీవె సాక్షిణి వగుచున్

క. ఠాయయి నకారం బుపస
ర్గయోగమున విడుచునంబ ప్రాథమ్యం బా
త్మయె యాద్యమయ్యె జీవుం
డయి స్వాతంత్ర్యము విడునటు ప్రారబ్ధమునన్.

చ. తనయులఁ జుట్టుఁజేర్చుకొని
దాఁగిలిమూఁతల యాటలాడఁ ద
జ్జననియె వారికన్నులకుఁ
జయ్యన గంతలు గట్టినట్టు లీ
మనుజుల జ్ఞాననేత్రములు
మాయను మూయుదు వీవె యంచు నే
ఘనులో యెఱింగి పండఁగ
జగజ్జనయిత్రి భజింత్రు నిన్ సదా.

క. థూత్కార మతని మొగమున
హృత్కంజమ్మున నెవం డకృత్రిమముగ ని
న్నుత్కంఠఁ గొలువ కంబ య
సత్కథలం జీవితంబుఁ జపలత జరపున్.

చ. దమము శమంబు లేక దశ
ధా భ్రమమాణమదింద్రియావళీ
[illegible] మణము సాగి నిన్నుఁ గొలు
వ[illegible]గ నశక్తుఁడ నెందు నెందుఁ జి

త్తము ప్రసరించు నాకచటఁ
ద్వచ్ఛుభరూపము నెందునే మదీ
యము శిరముందు నందు భవ
దంఘ్రియుగమ్మును జూపు మమ్మరో.

చ. ధన మొకయింత గల్గిన మ
ధమ్మున రేఁగు నరుండు సాధు బో
ధనమున నెట్టులెట్టులొ యు
దారత గల్గినయేని చిత్తశో
ధన మఱ విశ్వదాత నను
దర్ప మహాంతయుఁ బెంచునమ్మ దం
ధనము ధన మ్మనర్థములఁ
దారుచు నెల్లెడ మానవాళికిన్.

క. నలినము తేలుంబైపైఁ
గొలఁకున నిండినను జలము కూలంకషమై
కలగక యాతీరునె భవ
జలనిధిఁ దేలుదురు త్వద్భజనపరు లంబా.

గీ. పవనుఁడేరీతి నార్పు దీపంబు నట్టె
యారుపును జ్ఞానదీపము ననుచు యోగి
వరులు దానిని నాగి నివాతదీప
కళికనా నిల్చుమది నిన్నుఁ గందు రంబ.

మ. ఫలమే మా ఫణిరాజ భూష
ణుఁడు దా వాంఛించెనో కాని యు
జ్జ్వలసూర్యోడుపమండల
ద్వయవిరాజద్దివ్యసౌవర్ణకుం
డలినీ! వాని తపంబు పండె
నినుఁ జెట్టంబట్టఁ ద్వత్కుండలం
బుల కాంతింగద యంధకారి
యని పెంపుంగాంచె లోకమ్ములన్.

గీ. బట్టఁగట్టనివాఁడు నీ పతియటంచు
లోకులకు నాతఁడెట గనరాకయుండ
మాయుపన్నిది వేమొ హిమగిరితనయ
కానిచోఁ గనబడదె జగన్మయుండు.

చ. భగవతి! దేహియూ పరమ
పావనుఁడాతని దేహమెన్నఁగా
నగు నతికశ్మలంబు నరుఁ
డారయ కియ్యది దేహ మాత్మగా
వగచుచు నజ్ఞుఁడై పనస
పండు తొల ల్దివియంగలేక పై
నగపడు బంకలోఁ దగులు
నట్టులు సంసృతిఁజిక్కి స్రుక్కెడున్.

ఉ. మానస మెంతయాగిన ను
మా! యది యాపఁగరాక యాపగో
త్తానజలంబు లట్టులు వృ
థా చను చుండు బహిర్ముఖంబుగా
దానిని నిగ్రహించినను
దాననెకల్గు నపూర్వశక్తి సం
దానిత వాహినీ జలము
నన్ ఘనశక్తి ఘటిల్లినట్లుగన్.

క. యముఁడన భయమేటికి సం
యములకుఁ ద్వచ్చరణ పంకజార్చావిహితో
ద్యములకు సములకు వాచం
యములకు నఖిలామయార్తిహారిణి! యంబా.

మ. రమణీయంబగు నీ స్వరూప
మును శర్వాణీ! విపంచ్యాది వా
ద్యమృదుక్వాణమునన్ ఘనా
ఘన! మహాధ్యానంబునన్ దైత్యసం
ఘ మదధ్వాంతదివాకరాభ
భవదుగ్రక్రూర రూపంబు స్వాం
తమునం గందును విందు సంతతముఁ
బ్రత్యక్కర్ణ నేత్రంబులన్.

మ. లలితా! పద్మభవాండసంతతు ల
వెల్లంజూడఁ జిద్వహ్నిలో
నోలయుం గాదె స్ఫులింగ
వైఖరిని నోహో యెంతసేపవ్వి భా
సిలు నందెంతగు మర్త్యజీవిత
మదిస్నీ! మానవుండింత దాఁ
దెలియన్నేరక దేహరక్షక ము
చింతించున్ బహూపాయముల్.

చ. వననిధిలోని ద్వీపములు
వారిపరీతములై యనేకమై
కనఁబడు పైకి లోపల
నొకండగు పృథ్వియె యట్లె మాయచే
ననయము నావరింపఁ బడి
యద్వయవస్తువె పెక్కు రూపులై
మనమున భ్రాంతిఁ బెంచుచు
నుమా! నిజతత్త్వము నిహ్నవించెడున్.

చ. శరనిధిఁజేర వాహినులఁ
జాల్కొని వ్యక్తిగత ప్రభేదముల్
దొరగుచుఁ దన్మయంబులగు
తోయములట్టులు జీవపాళి నీ

చరణసరోజ భక్తి
వివశత్వమునఁ శివునందు లీనమై
పరమము నద్వయంబు నప
వర్గమునౌ పదమందు నమ్మరో.

గీ. షట్పదములట్లు సంయమిజనులు ప్రాప్త
మనుభవింతు రసంచయులగుచు నంబ!
పామరులు తేనెటీగలవరునఁ గూడఁ
బెట్టి కోల్పోయి దుఃఖింత్రు బిట్టు మదిని

గీ. సవిత నిర్మాణవించు జలదంబు లాతఁడె
కలుగఁజేయుఁ జేయఁగలరె యొరులు
అలవి మెనని కంబ! యాచ్ఛాదనము సేయ
నిన్ను నీవె మాయఁ బన్నకున్న.

గీ. హరిసహోదరుఁడట మహేశ్వరుఁడు నరుఁడు
స్కందహేరంబు లిద్దరుఁ గన్నకొడుకు
లంబుజాలయ వాణి నెయ్యంపుఁ జెలులు
సర్వమంగళ! నీదె యైశ్వర్యమన్న.

గీ. శిలల కారయ భేద మల్పంబెకాని
శాదిపదములు శబ్దజాలమున లేమి
దానిఁ దుదిదాల్చునట్టి శబ్దమున నీకు
మంగళము పాడుదును సర్వమంగళాంబ.

క. లయకరి వీవని మూఢులు
భయపడుదురు నిన్నుఁగొల్వ భైరవి యరయన్
లయమనఁ గైవల్యం బా
లయమున్ నీ పాదభజనలాలస నీవే.

క. హ్రీంకారీ! నీదగు మను
సంకేతము తెలియఁగ నాకు సాధ్యమె సాక్షా
చ్ఛంకరుఁడే గురుముఖమున
శంకారహితముగఁ దెల్పి సవరింపనిచో౯.

మ. హరిదశ్వాబ్జహుతాశనుల్
గనులు నీకై రేబవల్ సంధ్యలున్
విరచింపం దొరకొంద్రు నీవు
కరుణన్ వీక్షింపవే నీ౯దివా
కరుఁడేమై వెలుఁగున్ సుధాంశుఁ
డెటు సౌఖ్యంబిచ్చు నయ్యగ్ని యే
కరణి౯ మండును గాంతి
నీవె కదవే కామాక్షి! కాత్యాయనీ.

క. సర్వాతీతా! సర్వగ!
సర్వేశ్వరి! సర్వమంత్రసారాకారా!
సర్వాగమాంతవేద్యా!
సర్వాధారా! స్వతంత్ర! సర్వాభరణా.

క. క్రమలములు పంకజన్మము
లమలము లెట్లౌను జనని యనవరతము నిన్
విమలాధారాదుల షట్
కమలములం బూజ సేయఁగాఁ దలఁతు నజా.

క. హారసాయుజ్యముఁ బడయఁగ
హరియే నినుఁగొల్చి యాడుదయ్యెను మాకీ
పురుషత్వస్త్రయ మేటికి
గిరిజా! నీరూప మిమ్ము కృప దళుకొత్తన్.

క. లలితా! భండాసురుఁ డనఁ
గలఁడే జీవత్వశంకగా కద్దానిన్
బొలియింపుము నా మదిలో
గలిగింపుము విశ్వనాథ కైవల్యంబున్.

క. హ్రీంకారము శబలబ్ర
హ్మాంకము శివశక్తి సమరసాత్మక మఘనా
శంకరశక్తిప్రణవము
శంకరసాయుజ్యదంబు జపియింతు నజా!

మ. సమయాచార మెఱుంగఁ గౌళ
మతమున్ సాధింపఁగాఁ జాల యో
గము నభ్యాసము సేయనోపఁ
గ్రతు దీక్షల్ పూనఁగానేర వే

దము వల్లింప నశక్తుఁడన్
వివిధ శాస్త్రప్రక్రియల్ నేర్వ నో
హిమశైలేంద్రసుతా! నిరంత
రము "ఈఁ ఈఁ" యంచుఁ గూఁ పెట్టుదన్".

క. క్రలయనినఁ గల్లయనినను
గలదెల్లను నీవెసుమి జగంబున నందుం
గల సృష్టిశబలతయు నీ
కలాకుశలతనె తెలుపు జగద్ధాత్రి! శివా.

మ. లవమాత్రం బెవనిం గృపార్ద్ర
మతివై లక్షింతు వవ్వాఁడు మా
ఘవనీసంపద లెక్క
సేయునటవే? కైవల్యముం గామధే
నువుఁ జింతామణియుం
బొనర్చునొకో నిన్నుం గొల్వఁగా నేర్చినన్
శివసాయుజ్యమె యిత్తుగాదె
జననీ! శ్రీరాజరాజేశ్వరీ.

క. హ్రీంకారాంతర్గతమా
నీంకారమె కామకళయ టీ జగమునకున్
శాంకరి బీజం బదె యని
పంకజగర్భాదు లెద నుపాసింత్రుగదా.

గీ. త్రిపురసుందరి నిట్లు నుతించి యంత
విశ్వనాథుఁడు మున్నైన వివిధదైవ
తములఁ గొల్చుచునుండంగ ధర్మశాల
మమత యవ్వాని రూపంబు మదిఁ దలంచి.

ఉ. స్నానముసేసి వత్తునని సాగి చనంజన వానిరూపు సొం
పౌ నడతీరు నా పొడవు నారసి యారసి నిశ్చయించి యా
మానవతీలలామ మసమానధృతిన్ నయనాంబుజమ్ములన్
వానలువారు బాష్పములఁబట్టి యనుం దన యాత్మలోపలన్

గీ. నాదునాథుఁడు భర్త ప్రాణప్రియుండు
వరుఁడు కందర్పదర్పఘస్మరుఁడు గురుఁడు
రసికవర్యుఁడు సకలశాస్త్రప్రవీణుఁ
డితఁడె యితఁడె యిఁక సంశయింపనేల.

సీ. సంపంగినూనెతో సంస్కార మొనరించి
కుసుమదామంబులఁ గూర్చు సిగయు
గస్తూరి జవ్వాజిగంధంపుఁ బూతల
నిద్దంబుటౌ చెక్కుటద్దములును
పాముకూసమువోని వలిపెమ్ములోనుండి
తొంగిచూచెడుమేని బంగరు పస
పేరురమ్మున హారాసు మీఁరెడు మంచి ము
త్యాలపేరులు రత్నహారములును

గీ. కానఁగారాక యక్కట కపిలజటలు
గడ్డమును మోటజేగురు గుడ్డయంగి
తులసి పూసలపేరులు దోఁచుమాని
తులసిదాసుఁ డటంచని తలఁపనైతి.

ఉ. గడ్డముఁ గావిగుడ్డయును గన్పడినంతనె నాథుఁడేమొ యం
చడ్డవిరాగులందఱి సమీక్షయొనర్చుచు నింతకాల మే
పడ్డ శ్రమంబు నేటికిటు పండి తనంతనె చేరవచ్చినన్
గ్రుడ్డితనాన వల్లభునిరూపము పోల్చకపోతి నక్కటా.

గీ. మారురూపమువాఁడిట్లు మారురూపు
పడుటఁ గనినంతనే గుర్తు పట్టనైతిఁ
దన్నుఁ గానలకంపియుఁ దగుదునమ్మ
యనుచు బలుపెక్కు సనుఁ బోల్చుకొనకయున్న.

గీ. వీడిపోయిన పెండ్లాము వీడ తిరిగి
పట్టుకొన్నదటంచని భయముఁ జెంది
మరలిరాకుండ నెటకేని తరలునేమొ
యెటులు నిల్పుదు నాదుప్రాణేశు నిచట.

గీ. చాలతడవయ్యె విభుఁడేగి స్నానవిధులు
కాకయుండునె? యింకను గంగ కేగి
కాంతునంచని యా సాధ్వి కదలి నడవ
నెదురుగా వచ్చె నామునివృషభుఁడంత.

తన్నెఱుక పరచుకొన్నఁ
మన్ననసేయఁడో యను ననుమానము దోఁపఁ
మిన్నక సతి పతిపదములఁ
సన్నుతిఁ జాల్వారు బాష్పజలములఁ గడిగెన్.

సరసనర్మోక్తులఁ గరగింపకున్నను
కరుణింపఁడే మనోహరసుబోధ
మాలింగనమున నన్ లాలింపకున్నను
సమ్మతింపక యున్నె చరణసేవఁ
గూర్మిఁ జెక్కిలిఁ బుణ్కఁ గొంకిన, దీవింప
హస్తమస్తకయోగమైన నీఁడె
యధరసీధు వొసంగ నంగీకరింపఁడేఁ
బాదతీర్థముఁగోలు వలవదనునె
కప్పురపువీడ్యపుండావి కరువైన
పాదపూజాసుమంబుల వలపె చాలు
నాలినని యేలఁడే భక్తురాలిననుచు
జాలిఁ దరిజేరనిచ్చినఁ జాలు నదియె.

విషయసుఖజాతమెల్ల నిస్పృహుని మదికిఁ
బీడయేకాని యారయఁ గ్రీడకాదు
వలదు వలదన్న నే వన్నె వలువఁగట్టి
వత్తునని నాథు బలవంతపరపనోప.

గీ. క్రొత్తచేసెడి శిశువుల నెత్తుకొంచు
వారినేడ్పించి ముద్దాడు బంధులట్లు
ప్రియుని మది కింపుగానట్టి క్రీడఁదేలి
కాంతసాధించునట్టి సౌఖ్యం బదేమి.

గీ. తనదుకోర్కులు ప్రియునిమిత్తమునఁ దీర్చు
కొనుట కామమె యగుఁగాని కూర్మిగాదు
సాధునిష్టముఁ దీర్చు టానందమనుచు
స్వేచ్ఛలేకుంట నిక్కంపుఁ బ్రేమవిధము.

గీ. ఇట్లు మదిలోనఁ దర్కించి యింతి మిన్న
రేఁగు మదనుని సంరంభ మాఁగి యాఁగి
చిత్త మపచారభీతినై చిడిముడిపడ
వరుని నర్చించె నా పరాత్పరుఁ డటంచు.

ఉ. నారస మున్న నేమగు ననంగునిచే నని మారుఁ డాశుభా
కారను నాశ్రయించి సుమకాండములాయను చేతికిచ్చి యా
ధీరునిమీఁదికిం బనుపఁ దీక్ష్ణతఁగోల్పడి బాణముల్ సమ
స్కారశిలీముఖంబులయి సాధువు నంఘ్రుల వ్రాలె నత్తరిన్.

గీ. వాడువారెడుపూవుల వాఁడి గలదె
యనుచు భావజుఁ డయ్యుత్పలాక్షిచూపుఁ
దూపుగములను బ్రేరేప నేపుదక్కి
యతని పైఁబడ వవియు మందాక్షవశత.

గీ. అక్షియుగ్మము నెదుటఁ బ్రత్యక్ష మైన
మానిరూపముఁ గాంచి నమస్కరించు
నాత్మఁ బొడమెడు తొంటిమోహానసురూప
మెంచి మదిలోనె సతి కౌఁగిలించుఁ గూర్మి.

గీ. లీల నభిముఖి యగుచు నాలింగనమ్ము
సేయ వాంఛించియును బ్రిదక్షిణము సేయుఁ
జేతమునఁ బ్రేముడియు భక్తిచేఁతలందుఁ
దోఁప మునినాథు నర్చించెఁ దోయజాక్షి.

గీ. తనదునిష్ఠకు నా సాధ్వి దాస్య మంత
రాయముం జేయకుంట విరాగి యగుచు
శాంతిమై దాసుఁ డా ధర్మశాల నిలిచె
జ్ఞానదానము సేయ జిజ్ఞాసువులకు.

క. శితికంఠపాదవనజా
హితనిర్మలచిత్త! సాధుహితసచ్చరితా!
క్షితిపాలపూజ్యపాదా!
ఘ్రితితుల్యగభీరసూక్తి సుబ్బవధానీ.

ఇది శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహావిద్యాపీఠస్థాపనాచార్య
శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్ష లబ్ధ సారస్వతో
పాసనాసాదిత సరసకవితావిలాస శ్రీనివాస కవికృత
గురుభక్తినామక శ్రీ గోస్వామి తులసీదాస
చరితోత్తరఖండ మహాప్రబంధంబున
తృ తీ యా శ్వా స ము
ఓ మితి శివం.

శ్రీ భాష్యాయనమః

# గురుభక్తి



## చతుర్థాశ్వాసము



క. శ్రీవిద్యాపరిపూర్ణా!
సావిత్రీ మంత్రతత్త్వ సారవిచారా!
జైవాతృకకులవారిధి
జైవాతృక సాధులోక సన్నుతచరితా.

గీ. మమతఁ జొరనీక తులసి సంయమితచిత్తుఁ
డై మమతచెంత నా సత్రమందు నిలిచె
రామపదపంకరుహామకరందపాన
తత్పరుం డయి భక్తబృందములు గొలువ.

గీ. అగ్నిసన్నిధిఁ గరగని యట్టివెన్న
పాటలసుమంబుదరి నెఱ్ఱబడని స్ఫటిక
మమృతకరుఁగాంచి పొంగని యట్టివార్ధి
మమత పరిచర్యఁగొను దాసు మానసంబు.

గీ. దాసుఁ డిట్లుండి బ్రహ్మతత్త్వంబు భక్తి
వితతి కెలమినిఁదెల్పంగ నతని కీర్తి
సేతుశీతాచలాంతర సీమనెల్లఁ
బండు వెన్నెల భాతిని బ్రాఁకె నంత.

ఒక్కనాఁ డొకవిప్రుఁ డా యోగివర్యుఁ
జేరి ప్రణమిల్లి యంజలిచేసి పలికె
ధ్యాననిష్ఠకు నంతరాయంబు గల్గు
చున్నఁ గలదయ్య నాదొక్క విన్నపంబు.

మీరాబాయి యనంగాఁ
బేరెన్నికఁ గన్న వైష్ణవీరత్నము నీ
కీరితి విని ననుఁబంపెను
సూరివరా! యొక్క ధర్మసూక్ష్మ మెఱుంగన్.

అనఁ బ్రసన్నత దాసుఁ డిట్లనియె నతని
కంతరాయము గలుగదు ధ్యానమునకుఁ
బలుక గదవయ్య యమ్మహాభక్తురాలు
తెలియఁగోరెడు నట్టి సందేహ మేమొ.

బ్రహ్మవిద్యను నభ్యసింపంగ మాన
సంబునందునఁ దచ్చింతనం బొకండు
నొరులకుం జెప్పుటయును నన్యోన్యబోధ
నంబు నను నివి మూఁడుమార్గంబు లండ్రు.

చెప్పు మా యమ్మ యెవ్వరు చిత్తమందు
నామెకుం దోఁచు నా సంశయం బదేమి
గురుకటాక్షంబుచే నాకు గోచరించు
నంత దెల్పెద నన ద్విజుం డనియె నిట్లు.

గీ. కనకగర్భుఁడు బంగారుఁ గరఁగి కలికి
పోలికను బోసె వింత దేవాలయంబు
మీర యని దాని పేరిడి శౌరి నందు
నిలిపి తన్ముఖమునఁ బల్కు వెలఁది నుంచె.

మ. రసపుత్రప్రమదాలలామ మల మీరాబాయి షాత్రిళ్యలో
నిసువైనప్పటినుండి నందతనయున్ నీరేజపత్రాక్షునిన్
రసికశ్రేష్ఠుని గోపబాలకుని నా రాధామనోనాథు మా
నసమందు న్నెలకొల్పి సంతసిలుఁదన్నామంబుఁగీర్తించినన్

శా. సాధ్వీరత్నము భర్తయింటికి సదాచారంబుమై నేగి దా
విధ్వస్తాఖిలపాపకర్మయయి హృద్వీధిన్ ఘనశ్యాముఁ గం
సధ్వంసిన్ నెలకొల్పి భక్తిమెయి నిచ్చల్ తత్పదాబ్జార్చనా
మాధ్వీపానముసేయుచుండిగృహిణీమర్యాదఁబాటించుచున్

గీ. కృష్ణభజనము సేయంగ నింతిమిన్న
రమ్యమైనట్టి యొకమందిరమ్ముఁ గట్టి
శైశవంబాది దాఁబూజ సలుపు విగ్ర
హంబుఁ బూజించు నచట నేమంబు మీర.

గీ. వెలఁది హరికీర్తనంబుఁ గావించు వేళ
స్త్రీపురుషులకు నెల్ల మందిరములోని
కరిగి సేవింప నంతరాయంబు లేదు
శౌరి భక్తులు చొరరాని స్థలములున్నె?

క. హరిదాసబృందములు దనుఁ
బరివేష్టింపంగ మీఱ పద్మదళాక్షున్
భరతప్రక్రియ యొప్పఁగఁ
బరవశతం గొల్చుచుండుఁ బావనమతియై.

క. పెరవారి యెదుట నర్తన
పరతం గనఁబడుట పాటఁబాడుట యంతః
పురధర్మబాహ్య మనుచుఁ
బరివారలు కారులాడి సాధ్విని నొంపన్.

గీ. విభుఁడు మదిలోఁ గలంగియు వెలఁది చిత్త
శుద్ధియును భక్తియును నిజబుద్ధి నెఱిఁగి
యామె హరిసేవలకు నెట్టి యంతరాయ
మొనరుపక సద్వివేకియై యుండునంత.

ఉ. కాలవశంబునన్ విభుఁడు కాయముఁబాయఁగ మీఱకంతదు
ష్కాలమువచ్చె బంధులు సృగాలములట్టు లనేకభంగులన్
జాలముపన్నికొండెములుచాలఁగమామకునూరిపోయఁ జం
డాలుఁడతండు రేగి కరుణారహితో గ్రతమస్స్వభావుఁడై.

గీ. దినమునకు నొక్కరీతి నా మనుజవిభుఁడు
సుదతి హింసించు సాధుల క్షోభపరచు
సాఁగనీయఁడు దేవతార్చనము నెపుడు
నసురులను మించు నల్లరాజాధముండు.

గీ. సంగ్రహంబుగ నిట్టు లా జన్నిగట్టు
మీర చరితంబుఁ దెలుపఁగ గారవమునఁ
దలసి యిట్లనె "నాభక్తతిలకమునకు
నేను చెప్పఁగఁదగినది యేమికలదు."

గీ. అనిన విప్రుఁడు పల్కెనో యనఘ వినుము
యెంతవారికి నైనను సొంతపనుల
కృత్య మిదమిత్థమని నిర్ణయింపరాక
స్వాంత ముఖ్యాతలూఁగు సంశయము విడదు.

ఉ. రాజును బాంధవావళియు రాక్షసకృత్యములం బొనర్చి యే
యోజను హింససేసినను నుక్కిరి బిక్కిరియౌచు నింటనే
యోజ చెడంగనుంట తగవో? తగునో యిలువీడఁగాఁ బరి
వ్రాజకధర్మమూని ఋషివర్య! యెఱుంగఁగ మీరగోరెడిన్.

ఆ. కపటరహితమైన కలికి భక్తియెఱింగి
బంధుజనులవలని బాధ లెఱిఁగి
సాధువరుఁడు తులసిసందేశ మీరీతి
గారవమున ననిపె మీర కంత.

చ. భవమునఁ బ్రస్తుతం బయిన
బాంధవసఖ్యమె ముఖ్యమంచు నేఁ
నవుదును వీరికిన్ సుతుఁడ
నన్నను వీరికి వారితమ్ముఁడన్

ధవుఁడను దీని కంచు బహుధా తనుఁ
దాఁ దలపోసి నాకు నే
నెవఁడను నీ కెవండ నని యెన్నఁడు
వెన్నని యజ్ఞుఁ డెన్నఁడున్.

ఉ. నిక్కము నాత్మలోన
గమనింపఁగ నెవ్వరు నేరివారుగా
రక్కమలాత్ము మాయ జగ
మంతయు నింత యెఱుంగఁజాలమిన్
ద్రెక్కొను మోహపాశములఁ
దెంపునఁ ద్రెంపఁగలేక దీనుఁడై
చిక్కి కృశించి మర్త్యుఁడు నశించెడు
సంసృతిశోకముగ్ధుఁడై.

గీ. వాసుదేవునిఁ గొల్వఁ దోడ్పడెడువారె
యాత్మబాంధవు లని యెన్న నర్హులమ్మ
శౌరికిం గానివా రెట్టివార లైన
వైరు లని యెంచి వారికి దూర మగుము.

గీ. హరిని సేవింప నంతరాయంబు సేయు
వారి బాంధవు లని యేల గారవింపఁ
గనులకుం దిద్ద నేటి కంజన మటంచు
దృష్టిఁ బోగొట్టుదాని సాధ్విలలామ.

సీ. వైష్ణవద్వేషంబు బాటించు జనకుని
ప్రహ్లాదుఁ డోజఁ దిరస్కరించెఁ
శ్రీరామునెడ ద్రోహచింతచేసిన యన్న
విడనాడె మున్ను విభీషణుండు
మురళీధరునిఁ గొల్వఁబోనీని భర్తల
వల్లవాంగన లెల్ల నొల్లరైరి
వామనునకు నీయవల దన్న దేశికు
సరకుసేయఁడు బలిచక్రవర్తి
గీ. ధీరమతులైన వీరి యతీతచరిత
లద్భుతంబులు లోకకల్యాణహేతు
భూతములు జన్మబంధవిమోచనములు
తులసి మత మిద్ది యని మీర! తెలియు మమ్మ.

గీ. దాసు నుపదేశమును విని భూసురుండు
వినయమున నిట్టు లనియె నీకు గనిన కతన
పావనం బయ్యె నా జని భక్తవర్య!
పోయివచ్చెద నని భక్తి మ్రొక్కి చనియె.

గీ. అట్లు మీరకు సందేశ మనిపి దాసు
డనుదినంబును దనుఁగొల్చు నాశ్రితులకు
తత్త్వ ముపదేశ మొనరించుతరి నొకప్డు
విప్రుఁ డొక్కరుఁ డిట్లని పృచ్ఛచేసె.

క. గురుఁ డంచు నమ్మి నిరతము
పరమాత్ముని సేవఁజేయ నలినభవాదుల్
స్థిరబుద్ధి నిలుపఁజాలని
పరతత్త్వముఁ దెలియు ననఁగవచ్చునె యనఘా.

గీ. శ్రీ సదాశివు లింగాభిషేక మొక్కొ-
శ్రీనివాసుని పవళింపుసేవయొక్కొ-
వరదరాజుల గరుడసేవయొ మహాత్మ!
సాటివానినిఁ గొల్వ మోక్షంబుగలదె?

చ. అన విని దాసుఁడిట్లనె మహాశయ! యిట్టివి శంక లెన్నియేఁ
మునుపును బుట్టె నీ విశయముం బుధవర్యులు చాలనంబు సే
సిన తెఱఁ గే నెఱింగినది చెప్పెద నొప్పుగ శ్రద్ధధానుఁడై
వినుమని చెప్పఁగాఁదొడఁగె విజ్ఞులుమెచ్చఁగసారవాక్యలన్.

ఉ. దారుశిలాదివిగ్రహవితానము దైవతబుద్ధిఁ గొల్వ వం
దారుజనాళి కిష్టఫలదాయక మాట నిజంబ యేని దు
ర్వారదురంతసంసరణపాశనికృంతనదక్షుఁ డౌ మహా
కారుణికోత్తముఁ గురునిగా భజియింప శుభంబు గల్గదే?

గీ. బలముగల్గియు మారుతి వార్ధిదాఁట
జాంబవంతుఁడు తెలుపక చాలఁడాయె
బ్రహ్మయే యయ్యు నరుఁడు "తత్త్వమసి"యనుచు
దేశికుఁడు తెల్పునందాఁక తెలియలేఁడు.

క. వేదాంత మెల్లఁజదివిన
వాదంబులు మాని గురుని భజియింపకయే
భేదస్ఫురణము మానునె
మోదము ఖేదంబులేని ముక్తి గలుగునే.

గీ. పాకశాస్త్రంబుఁ బఠియింప వంటరాదు
కామశాస్త్రంబుఁ దడవినఁ గాంతరాదు
వైద్యశాస్త్రంబు నేర్చిన వ్యాధిపోదు
తత్త్వశాస్త్రంబుఁ జదివినఁ దనువుపోదు.

గీ. స్వానుభూతిని తత్త్వదర్శన మొనర్చి
శిష్యునకుఁ ద్రోవఁజూపు దేశికుఁడు లేక
తత్త్వమస్యాదివాక్యసంతతులు నరుని
సంశయగ్రంథి భేదింపఁ జాలు నొకో.

గీ. తనదుమోమును గనఁగ నాదర్శమునకు
నభిముఖస్థితి నుండిన యటులె యాత్మ
తత్త్వ మెఱుగంగ దేశికోత్తమున కాభి
ముఖ్య మవసర మగును ముముక్షువునకు.

క. బద్ధుఁడు జీవుం డనుట య
బద్ధము మోక్షంబు సిద్ధపద మనుచు బుధుల్
సిద్ధాంతముచేసినను బ్ర
బుద్ధుఁడు గాకుండు గురుఁడు బోధింపనిచోఁ

గీ. గ్రీష్మభాను ప్రతాపనైర్ఘృణ్య ముడిపి
ప్రావృడంబుదవర్ష ధారలఁ దొలంచి
రక్ష యొసఁగఁగజాలు ఛత్రంబులీల
ద్వంద్వములఁ బాపు గురుపదద్వంద్వ మొకఁడె.

క. ఈ యర్థము సుగమముగాఁ
జేయఁగ విబుధాళి నాకుఁ జెప్పిన యొక యా
ఖ్యాయిక వినిచెద నే వినుఁ
డీ యవధానమున నిప్డు డెల్ల సదస్యుల్.

గీ. చూఁడి సింగము గొఱియలఁ జొచ్చి చంప
గడఁగునంతటఁ బ్రసవించి కాలవశతఁ
బ్రాణములు వీడ సింహశాబకము గొల్ల
వాఁడు గొనిపోయి పెంచె నవ్యాజకరుణ.

గీ. క్రౌర్య మెఱుఁగక యంత సింగంపుఁ గొదమ
గొల్లపెనుపఁగఁ దానును గొఱ్ఱెమందఁ
గలిసి తిరుగుచు నడవి నాకలముఁ దినుచు
స్వస్వరూపావబోధంబుఁ బడయకుండె.

క. భర్జింప దవిసమూహము
నిర్జింపదు వన్యసత్త్వనివహము నెపుడున్
గర్జింపదు హర్యక్షం
బూర్జితమృగరాజజన్మ మూహింపమిచేఁ

గీ. తనదు గర్జారవంబున దంతిచయము
గజగజవడంకఁ జేయు సింగంపుఁ గోదమ
గ్రామసింహము మొఱఁగినఁ గాందిశీక
మగుచు గొఱియలతోఁ బారు నక్కటకట.

క. లేళ్లకుఁ బొట్టేళ్లకుఁ గుం
దేళ్లకుఁ దేళ్లకు నెమళ్లనృత్యములకుఁ దోఁ
డేళ్లకు జంకుచు సింగము
త్రుళ్ళిపడుం బిట్టయేని తుఱ్ఱుమనంగన్.

ఉ. అంతట నొక్కప్రొద్దున
వనాంతము వెల్వడి సింహమొక్కఁ డ
త్యంతక్షుధావ్యథార్తిని
గృతాంత నితాంత దురంత దుర్దమ
క్రాంతిని గొఱ్ఱెమందలు
వికావికలైచనఁ దాకె గొల్ల ది
గ్భ్రాంతినిఁజెంద శాతనఖరంబుల
దంష్ట్రలఁ జీల్చి చెండుచున్.

క. అఱ్ఱులు దెగిపడ ధరపైఁ
బుఱ్ఱెలు తిలలంతలేసి ముక్కలుగాఁగా
గొఱ్ఱెలు వందలు మ్రందఁగ
నఱ్ఱాఁకలి మండలోన హరి విహరించెన్.

గీ. అట్లు చెలరేఁగి తాఁకి సంహారలీల
మందఁగలచఁగ భీతి నమందగతిని
బారిపోయెడు గొఱ్ఱెల బారులోన
సింగపుంబిల్లఁ గనె వృద్ధసింహ మంత

మ. అరరే! యేమిది సింహశాబక
మసింహంబాచుఁ దక్ గొఱ్ఱియల్
పరివేష్టింపఁగ మందలోఁ
గలిసి శుంభచ్చౌర్యముం బాసి యీ
సరణింబారు నిసర్గభిన్న
ముగ నేచందమ్మునక్ మాఱెనో
యరయంగాఁ దగునంచు నా
కొదమపై హార్యక్షు ముద్రేకియై.

గీ. కవిసి పట్టఁగ నంత సింగంపుఁ గొదమ
కంపమొదవఁగ మృగరాజ! కావుమనుచు
మొఱ్ఱవెట్టఁగ నవ్వుచు ముసలిసింహ
మాదరమ్మున దానికి ననియె నిట్లు.

గీ. వంశగౌరవ మెన్నక పందవగుచు
గొల్లమందలలోఁజేరి కురరివోలె
దీనగతినున్న నిన్ను బోధింపనెంచి
తరిమిపట్టితి నినుఁ జంపు తలఁపులేదు.

గీ. మత్తగజ కుంభ నిర్ముక్త మౌక్తికములఁ
గందుకక్రీడ సల్పు సింగంపుఁగొదమ
గొఱ్ఱె పెంటికలంబడి గొండ్లిసల్పు
కటకటా! యింతకన్న దుఃఖంబు గలదె.

క. గిరికందరములు ప్రోయఁగఁ
గరిఘటలుం బెదరి చెదర గర్జింపక యో
హరిపుత్ర! కురరిసరణిని
సురిగెద విది యేమి కర్మసూత్రమహిమయో!

గీ. అల్పసత్వము లివి మంద నడఁగియుంకుఁ
గందరాంతరములను నేకాంతవృత్తి
నెక్కటిగనుంట మనకు మృగేంద్రపుత్ర!
యుచిత మీ నీచసహవాస మొప్పునయ్య.

గీ. అనుచుఁ బల్కెడు వృద్ధసింహంబుఁజూచి
వెలవెలంబోయి యిట్లను బిల్లసింగ
మోయి మృగరాజ! యేటి కీ యుల్లసములు
కొదమసింగ మదెట్లను గొఱ్ఱెపిల్ల.

క. కరుణించి నన్నువిడువుము
గొఱియలు దూరంబుపోయె గొల్లండైనన్
దరిఁగానరాఁడటన న
బ్బురమున నా ముసలి సింహము పలికె నంతన్.

క. ఓ సింహకుమారక! య
థ్యాసం బిది యెట్లు కలిగె? నవి ననుచు విప
ర్యాసముగా బ్రతికెదవే
కేసరిలోకమునకు నపకీర్తి ఘటిల్లన్.

క. కురరివిగావు కుమారక !
పరిహాసముగాదు నాదువాక్యము వినుమీ!
హరి వగుదువు నాయట్టులె
స్వరూప మెఱిఁగికొని మనుము సాహసవృత్తిన్.

గీ. ఇట్లు చెప్పినఁ గలరూపు నెఱుఁగకున్న
నాత్మసాక్షాత్కరణమును హరికిశోర
మునకుఁ గలిగింప దంష్ట్రలఁ బొదివికఱచి
పట్టి దానిని నొక నదీప్రాంతమునకు.




గీ. బలిమిఁ గొనిపోయి ప్రతిబింబములు జలముల
గన్పడెడురీతి నిల్పి సింగంపుఁగొదమ
వృద్ధసింహముభావంబు నెఱుఁగ లేక
యుద్దుగుడుచుచు దిగ్భ్రాంతి నుండి యుండి.

ఉ. ఆ నదిలోనఁ గన్పడు నిజాననముం దిలకించి చెంగటం
గానఁగవచ్చు నా హరిముఖంబునఁ బోలిచిచూచిచూచి పం
చాననశాబకంబు వికచాననమై నిజతత్త్వమెంచి యా
త్మానుభవంబునం దనదు హైన్యముఁబాసి చరించె నున్నతిన్.

ఉ. దేహి భవాబ్ధిలో మునిఁగి
తేజముఁ గోల్పడి దీనుఁ డౌచు దా
సోఽహ మటంచు సద్గురున కంజలి
చేసి భజించి తత్కృపన్
సోఽహ మటన్న యామనువు
చొప్పుఁ గనుంగొని సిద్ధిఁగాంచి సం
దేహముఁబాసి శోకజలధిం
దరియించి సుఖించు ముక్తుఁడై.

చ. శ్రుత మది యెట్టిదైనను
స్వరూపనిరూపణహేతు వెన్న వం
దిత గురుపాదయుగ్మ మగు
దేశికు దైవతబుద్ధిఁ గొల్వ న్యా
నత ఘటియించునం చని
మనమ్మున నెంచు టహాంత యద్దె సం
సృతికిని సర్వదుఃఖముల
కిక్క యగుంగద నిక్క మారయన్.

మ. పరతత్త్వం బది గూఢరత్న మటు
సువ్యక్తంబు గాకుండు స
ద్గురుపాదంబున నెవ్వఁడే
కరములం గూర్పంగ శక్తుండు వాఁ
డరయున్ దక్కినవారు
శాస్త్రసికతావ్యాయామఖేలం బర
స్పరవాదమ్ముల దుమ్ము రేపుదు
రహంభావప్రపూరాత్ములై.

చ. గ్రహములఁ బెద్దయయ్యు
నవికర్తనుఁడై శశి కాత్మతేజమున్
మిహిరుఁ డసూయలే కొసఁగి
మిత్రుఁడు దానయి రాజుగా నను
గ్రహమున వానిఁ జేయు నదిరా !
పరతత్త్వ మెఱింగి నట్టి ని
స్పృహు లగు దేశికోత్తములు
శిష్యుల కున్నతు లిత్తు రీగతిన్.

గీ. పల్వలంబులఁ జేరెడు వరదనీరు
శాస్త్రవిజ్ఞాన మరయ వాసనలఁ బెంచుఁ
జేదిన కొలంది నుబుకు కూపోదకంబు
బ్రహ్మవిద్వరు వైదుష్యవైభవంబు.

గీ. శాస్త్రపరిచయమునఁ గల్గు జ్ఞానలేశ
మరయ మిడుగురుపుర్వుల మెఱుపుసరణి
దేశికుని కృపదోఁచు, ప్రతిభ దలంప
భాస్కరోదయ మఖిలదుర్భ్రాంతిహరము.

క. ఖద్యోతకిరణములు సక
లద్యోతకములు తమోవిలయహేతువులా
ఖద్యోతపు మిడుగురు దుః
ఖద్యోతక మరయ నంధకారము పెంచున్.

గీ. భయము మోహము లేదు సర్వజ్ఞుఁ డైన
వట్టిజడుఁ డైన నిసుమంత నంత లేదు
తెలివి యొక్కింత గలుగ భ్రాంతిని మునింగి
భ్రమింగ నుమియఁగఁ జాలక మిడుకు నరుఁడు.

గీ. ఇట్లు దాసుండు విసువక యెల్లరకును
బ్రాతచదువుల తుదల గోప్యంబు నెల్ల
సులభ మగు ఫక్కి నరటిపండొలిచినట్లు
క్రొత్త దృష్టాంతములతోడఁ గూర్చి తెలుపు.

క. ఉపమింపరాని తత్త్వము
నుపదేశింపంగ నవనవోన్మేషముతో
నుపమాననిర్బదముల ని
రుపమం బగు ప్రతిభ దులసి యొప్పఁగఁగూర్చెన్.

గీ. పరులు పల్కినమాటల నెరవుగొనక
తానె కల్పించుఁ దులసి నిజానుభూతిఁ
దనదు బోధకుఁ దగిన నిదర్శనముల
నాత్మవిదులకు బాహ్యాలక్ష్యంబు లేల?

గీ. దాసుఁ డీరీతి సకలజిజ్ఞాసువులకు
నాత్మతత్త్వము బోధసేయంగ నతని
సద్యశంబును నగ్బరుచక్రవర్తి
తెలిసి పిననాఁటి నెయ్యంబుఁ దలఁచి మదిని.

గీ. విబుధగాయకకవివరుల్ వెంటరాఁగ
వందిమాగధజనములు ప్రస్తుతింపఁ
బరిభవంబున నంత నగ్బరున్నృపాలు
డెలమి నేతెంచెఁ గాశికిఁ దులసిఁజూడ.

గీ. వసుమతీశుఁడు దనుఁజూడ వచ్చునంచుఁ
దెలిసి దాసుఁడు జాహ్నవీతీరభూమి
వాని కాతిథ్య మొసఁగఁగఁ బర్ణశాల
లెన్నొ రమణీయముగ నంత నేరుపరచె.

గీ. తారకావృతుఁడైన చంద్రమునిలీల
శిష్యగణముల నడుమ భాసిల్లి తులసి
తన కులాచారపద్ధతి ననుసరించి
వినయమున మ్రొక్కె నృపతికిఁ బ్రీతి యొసఁగ.

గీ. స్వాగతం బిచ్చి తగిన యాస్తరణమందు
వాని గారవ మొప్ప నాసీనుఁజేసి
కుశల మారసినంత నా కువలయేశుఁ
డాదరమ్మునఁ దులసికి ననియె నిట్లు.

గీ. తృషితనిజశిష్యచాతకతృష్ణఁ దీర్చు
టనఁగ మీవంటి ప్రజ్ఞానఘనుల కెంత
ప్రీతిదళుకొత్త మా యరబ్బీయెడారి
చిత్తముల బోధవృష్టిని జినుకుమయ్య.

గీ. సర్వమతముల సారంబు సంగ్రహించి
నవ్యమతమును నెలకొల్పు నాదుపూన్కి
నీ వెఱింగిన దేకద నేఁటివరకు
నీ ప్రవాసంబు కతమున నెగడదయ్యె.

ఉ. బాసయొనర్చి పల్కెదను బ్రహ్మవిదగ్రణి! కొంకులేక య
ర్ధాసనమిచ్చి సోదరుని యట్టుల నిన్ను బహూకరింతు నీ
శాసన మెల్లవారు శిరసావహియింపఁగ నీకు నిచ్చలున్
బాసటగా మెలంగెదఁ బ్రవాస మిదేటికి రమ్మ యింటికిన్.

చ. అన విని దాసుఁడిట్లను "బ్రహర్షముఁ జెందితి రాజచంద్ర! నీ
నెనరున కెంతో; నీయెడల నెయ్యమునాకును దొంటియట్టులే
పనుపడి యుండు; నట్లయిన భావమునం గడునే వగింతు నే
ననయము శాంతిభంజక మటంచని రాజగృహాధివాసమున్.

క. వాసవుఁడే రమ్మని య
ర్ధాసన మిచ్చినను నిస్పృహాత్ముల కది ప
ద్మాసన మిడు సౌఖ్యమునన్
వీసం బేఁజాలదయ్య పృథ్వీనాథా.

క. అహికిన్ విడిచిన కుబుసము
స్పృహణీయము గానియట్లు జీవన్ముక్తిన్
విహరించు యోగివరులకు
నిహసౌఖ్యము కోరఁదగదు పృథ్వీనాథా.

చ. మతము లవెన్నియైనఁ బర
మంబగు తత్త్వ మొకండె తత్త్వసం
స్థితికి మతంబు లేదు; నృప
శేఖర! సాధక సాధనార్థమై
కృతమతు లెన్నియే మతము
లిమ్మహిలోఁ నెలకొల్పినారు వా
ని తరతమప్రభేదముల
నిర్ణయ మారయ నిష్ఫలంబగున్.

క. మాధుర్య మొక్కఁడయ్యును
పాథులు వేఱైనఁ జూతపనసాదులలోఁ
భేదముగఁ దోఁచులీలన్
బోధక భేదమున శాస్త్రములు భేదించున్.

క. పలువితములైన మతములఁ
గలసారము నేర్చి కూర్పఁగా సంకరమై
కలగూరపులుసునంబలెఁ
గలుగద యొకదాని సుగుణగౌరవ మైనన్

గీ. కన్నతల్లియుఁ దండ్రి యజ్ఞానులైన
దనకు సంపూజ్యు లైనట్లు ధరణినాథ!
ఖ్యాతముగ వంశమం దనుస్యూతమైన
మతమె హిత మెల్లరకు నని మామతంబు.

క. తలిదండ్రులఁ బూజించుచుఁ
బలలం బమ్ముకొనికాదె బ్రహ్మజ్ఞుండై
వెలసెను ధర్మవ్యాధుఁడు
కులధర్మ మదెట్టిదైనఁ గొలువఁదగినదే.

క. ప్రాక్తనవిశ్వాసములు
ద్రిక్తుఁడవై చెఱుప వసుమతీధవ! తలఁతేన్
వ్యక్తిత్వము నశియించును
భక్తియుఁ జెడు దాన శుష్కవాదము లెగయున్.

ఉ. ఎల్లమతంబులం జదివి యెయ్యవి
యెందు గుణంబుగాఁగ నీ
యుల్లమునందుఁ దోఁచు నవి
యొప్పుగ నొక్కడఁ గూర్తు నందు భూ
వల్లభ ! పెక్కుపుష్పములు
పత్రములున్ సమకూర్చి కట్టు నా
యల్లికదండ నిల్చునె రయంబునఁ
బోఁడిమి వీడి వాడదే.

ఆ. మంచిచెడ్డ లెంచి మతములఁ జెఱుపకు
మహిమ లోసఁగు నది ప్రమాణబుద్ధి
మట్టిద్రోఁబుఁ గొల్చి జెట్టివిల్కాఁడౌచు
నేకలవ్యుఁ డెసఁగఁడే ధరిత్రి.

శా. నానాత్వంబు ప్రపంచధర్మము
సమానత్వంబు దుర్భ్రాంతి డెం
దానన్ సర్వము బ్రహ్మమం చెఱిఁగి
యద్వైతంబు భావించి మాయా
నాట్యాంగణ మీ జగం బనుచు
శాంతాత్ముండవై యెద్ది నీ
కై నిర్ణీతమొ యట్టి పాత్ర
మున నీ యాటాడు టే సిద్ధియా.

చ. అరమర లేక యివ్విధి యథార్థముఁ బల్కెడు దాసు ధీరతన్
నరపతి యాత్మ మెచ్చుచు వినమ్రత నంజలిచేసి యో యతీ
శ్వర! యిదియిట్లు సేయుమని శాసనముం బొనరింప నీకు నే
తెరు వుచితంబదే యనుమతించెదఁ జేయుదు నీదునిష్టమున్.

క. జంగమతులసీవృక్ష మ
నంగా నానందకాననంబున వనమా
లిం గొలుచు భక్తతతి పూ
జంగొని వర్ధిల్లుమయ్య సాధువరేణ్యా!

క. అని పనివినియెద ననుచున్
మను జేశుఁడు కనకటంకమణినిచయ ముపా
యనముగ దాసున కిడి దాఁ
జనియెన్ భటసచివబంధుసహితుం డగుచున్.

గీ. కర్బ్బురములకు నిది మూలకంద మగుటఁ
గర్బ్బురం బని జగతిఁ బ్రఖ్యాతిఁగాంచె
హేయ మిది దీని దాఁచు టనిష్ట మనుచు
తులసి యాధన మెల్ల విప్రులకు నిచ్చె.

క. నిగమాంతసారవిద్వర!
భగవద్భాగవతచరణపంకజభృంగా!
విగళితభవశృంఖల! ప
న్నగభూషణదేశికకరుణాప్రావరణా!

ఇది శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహావిద్యాపీఠస్థాపనాచార్య
శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్ష లబ్ధ సారస్వతోపాసనాసాదిత సరసకవితావిలాస శ్రీనివాస కవికృత
గురుభక్తినామక శ్రీ గోస్వామి తులసీదాస
చరితోత్తరఖండ మహాప్రబంధంబున
చతుర్థాశ్వాసము
ఓ మితి శివమ్.



శ్రీ భాష్యాయనమః

# గురుభక్తి



## పంచమాశ్వాసము



క. శ్రీమత్త్రిలింగ పీఠ
స్వామీ! ప్రథితార్షధర్మసత్పథగామీ!
ధీమణి! సత్కవివంశ
గ్రామణి! పరతత్త్వవిచ్ఛిఖాగ్రథితమణీ.

గీ. కామినీకాంచనములందుఁ గామ ముడిపి
తులసి యీరీతి నిత్యసంతుష్టి నుండ
నతని తన్వంగి మమత మమతవిడువక
యతనుతాపవశాత్మయై యార్తిఁ జెందు.

ఉ. "చేరఁగరాక విష్ణుపదసీమ వెలింగెడు లోకబాంధవున్
గోరి నిరీక్షసేసి తమిఁగూరఁ గుశేశయమైన పద్మినీ
వారముభాతి నాథు సహవాసములేని దురంతయామినీ
భారముతోఁ గుశాసనముపైఁ బడియుండ విధాత! వ్రాసితే.

గీ. ప్రియుని దర్శింప నబ్బని వేళలందు
నళినికిం గొంత విశ్రాంతి గలుగు నెట్లొ
పవలు రేయియుఁ గనుమూఁత పడని నా ని
రీక్ష కెపుడేని కల్గునె యెడయుఁ గడయు.

చ. దగఁగొని కూపతీరమునఁ దారుచు స్వాదుజలంబు నానఁగా
వగచి గుణంబుగల్గని యభాజనుఁ డట్టె గభీరవారి నా
నఁగనఁ బిపాస తీరునె? ప్రశాంతి వహించునె నామనమ్ము ద
వ్వుగ నిలుచుండి నాథుపదపూజలొనర్చినమాత్రనక్కటా.

చ. మనమున నాకుఁగల్గ దణుమాత్రము లోలత మారలీలలం
దెనయఁగఁ గోరికాదు తపియించి కృశించుట నాదుభర్తయి
య్యనఘుఁడటంచుఁ జెప్పుకొను నంత స్వతంత్రత లేక సత్రభు
గ్జనమున నీవుగూడ నొక "కశ్చన" వంచననాథ! యోర్తునే.

శా. నా దీ సత్ర మటంచు సాధువుల సన్మానించి నే నన్నపా
నాదుల్ గూర్తునటంచు నెల్లరు మదీయఖ్యాతిఁ బాడంగ నాఁ
గాదంచుక్ వచియింప రాదుగద! నిక్కం బెన్నఁగా నివ్యోర్థక్
నా దేమున్నదయో భరింపఁదరమా? నాథా! యనర్హాప్రథక్.

చ. గురుఁడని నీదుపాదముల
కుం బ్రణమిల్లుదుఁ గాక యా పరా
త్పరుఁడని యర్చ సేసి మది
ధ్యానము సేయుదుఁ గాక మన్మనో

హరుడవు భర్తవంచు భవ
దాజ్ఞ మెలంగి భజింపఁగల్గు ని
ర్భరసుఖ సారవశ్యవిభవంబు
లభించునె ప్రాణనాయకా!

ఉ. ఎవ్వతెవీవు ? కాశి నిటు లేటికి నొంటివసింతు? భర్త నీ
కెవ్వఁడు? వానిఁగొల్వక యతీశ్వరపూజలు ధర్మసత్రముల్
నివ్వటిలంగఁ జేయు టిది నీతియె? యంచు జనంబులాడ నే
నెవ్వరిదాన నంచు వచియింపఁగవచ్చును ప్రాణనాయకా!

గీ. ఇట్లు మదిలోనఁ జింతించు నింతిమిన్నఁ
జేరి యొకవిప్రవర్యుఁ డాశీర్వదించి
యామెచే సత్కృతుం డయి యర్ఘ్యపీఠ
మందు వసియించి పల్కెను సాదరముగ.

క. జరిగినవి జరుగుచున్నవి
జరగంగాఁ గలవి యెల్ల సారసనేత్రా!
యెఱుకపడు నాకు, నీమది
మెఱమెఱ గ్రహియించి జాలిమెయి నినుదేర్పన్.

గీ. తలఁచి వచ్చితి నిటకు నో తలిరుబోఁడి!
పామరాంగనలీల నీ భర్తకొఱకుఁ
బవలు రేయియు నిట్టులు పరితపింప
విదుషివౌ నీకుఁ దగునె యీ వెఱ్ఱి యేల?

చ. ధవుఁడు విరక్తుఁడౌచుఁ బర
తత్త్వసమాహితచిత్తుఁడైనచో
నవయుఁగఁ బాడి యౌనొకొ
మనస్విని! నీ హితబోధ మాత్మలోఁ
దవిలి యతండు సిద్ధిఁగను
టారయ నీ కదియుం బ్రకర్షహే
తువుగద! వానిఁగోరి పడఁ
ద్రోయుదువే భవవార్ధిఁ గ్రమ్మఱన్.

క. దారేషణ నరునకు సాం
సారికబంధం బటంట సత్యం బైనన్
నారికిఁ బతిపై లౌల్యము
సారసముఖి! యోగ్య మగునె? జ్ఞానద మగునే?

క. జీవునకు మోక్షమే పర
మావధి యగుఁగాదె! మగఁడు నాఁడుది యనఁగా
జీవునకు లింగభేదం
బే వేదాంతములు సెప్పు నిందునిభాస్యా!

క. మమతా! వేదాంత రహ
స్యము నీ వెఱుఁగని యదియె "యహంబ్రహ్మాస్మి
తి" మహావాక్యము చెల్లదు
రమణులయెడ ననుచుఁ జెప్పిరా యెవ రేనిన్?

క. దేహాభిమానమూలవి
మోహాలతాద్రోహదంబు పొలఁతీ! భర్త్ర
స్నేహము హేయము విడువుము!
సోఽహమ్మని శాంతి మనుమ! శుభముం గనుమా!

చ. అనవిని సాధ్వి యిట్లనె మహా
మతి! నీదు పరేంగితజ్ఞతన్
మనమున నబ్బురం బొదవె
నాహితమెంచి కృపామతిన్ ననున్
గనుటఁ గృతజ్ఞురాల నధిక
ప్రతిభాప్రవణంబు నీదు వా
క్యనిచయ మాడుదాన నవు
గాదని వాదము సేయవచ్చునే?

గీ. తత్త్వ మద్వైత మగుట తథ్యంబె యైన
జీవుఁడే దేవుఁ డనుమాట సిద్ధమైనఁ
బుడమి స్త్రీత్వముఁ గన్న జీవునకు విధి వి
హితము పతిసేవ యని శ్రుతిస్మృతులు సెప్పు.

గీ. ఐక్యపరమైన వేదాంతవాక్యచయము
నెంతచదివిన గురుసేవ నెఱుఁగనట్టి
నరున కపరోక్షమైన జ్ఞానంబులేదు
పతిని గొలఁని సతికి సద్గతియు లేదు.

శా. 'నాద్వైతం గురుసన్నిధౌ' యనెడు
న్యాయంబొప్ప నీ ధాత్రి జం
బూ ద్వీపంబున జన్మముంగనిన
పూర్వుంబోఁడి యాత్మేశుపా
దద్వంద్వమ్మును నాలయంబు
మదిలో ధ్యానించు సేవించు నో
విద్వద్వర్య! యెఱుంగకుండు
దువె సాధ్వీధర్మమర్మంబులన్.

ఉ. ఇష్ట మనిష్టమంచనక
హేయము గ్రాహ్యమునంచుఁ బల్కక కు
త్కృష్టనికృష్టభేదముల
నెన్నక కష్టసుఖంబు లెంచక
క్లిష్ట మనంబునన్ ధవు న
కృత్రిమ భక్తి భజించు కన్న నే
యిష్టులు యోగముల్ వ్రతము
లింతికి లేవు మహీసురోత్తమా.

శా. పాతివ్రత్యము కల్మిఁగాదె
యలలోపాముద్ర మున్నౌనతుల్
ఖ్యాతింగాంచుట యాఁడుపుట్టు
వకు వేరా నేమముల్ నిష్ఫలుల్
జాతుర్యంబు లధర్మముల్
ధవుని దాస్యంబుల్ వినా పెద్ద లీ
రీతిం బల్కు టెఱుంగవా కొ
ననుఁ గారింపంగ నింకేటికిన్.

క. అపవర్గమార్గ మెఱుఁగదె
యపర్ణ యేమిటికి నటు మహాదేవునికై
తపియించె? లతిక నిల్చునె
యుపఘ్నరక్షణము గల్గకున్నను విప్రా!

ఆ. ఎఱుకలేనియట్టి యింతులపోలిక
దేహసుఖముఁగోరి దేవురింప
మోహవార్ధి మునిఁగి ముంపఁగఁజూడను
ధవునిపదముఁబట్టి దాఁటుదాన.

గీ. ధర్మవిహితంబుగా నిట్లు తన్వి పల్క
భూమిసురుఁ డంత నోయమ్మ పోయివత్తు
మగని మన్ననకుం బాత్ర మగుదుగాక!
యనుచు నాశీర్వదించి తా నచటు బాసి.

గీ. తులసి యున్నెడ కేగ నయ్యలఘుచరితుఁ
డతని కుశలంబు నరసి యర్ఘ్యాసనమున
నునిచి విప్రోత్తమా! దాసుఁ డోపునట్టి
కృత్య మెది యైనఁ గల దేని యెఱుఁగఁబల్కు.

గీ. అనఁగ విప్రుఁడు పల్కె నో యనఘచరిత
చేయలేనట్టి కృత్యంబు లీయరాని
వస్తువులు నున్నె శ్రీ రామపాదపద్మ
భక్తిసామ్రాజ్యపదపట్టభద్ర! నీకు.

గీ. విశ్వజిద్యాగదీక్షాపవిత్రవంశ
సంభవుండైన శ్రీరామచంద్రు దివ్య
నామ మను కామధేనువు నామతించు.
నాప్తకాముల యీవికి నవధిగలదె.

చ. అన విని దాసుఁ డిట్లను ధ
రామరశేఖర! గత్వరంబు లౌ
ధనములఁ గూడఁబెట్టుట
వృథాశ్రమగాదె నృపుండు నా కుపా
యనము లనంతరత్ననిచ
యంబు లొసంగెను వానిలోన నీ
మనసయినన్ని తీసికొను
మా యనుమానము మాని స్వేచ్ఛమై.

ఆ. దాసుఁ డిట్లుపల్క భూసురుం డనునంత
ధనమువలదు నా కుదాత్తచరిత
తెలుప మానహాని తెలుపకయుండినఁ
బ్రాణహాని గలుగు ననఁగఁ దులసి.

ఉ. నా వశమైన దేది యయి
నం గొను మిచ్చెదఁ గొంకులేక నీ
భావము నాకుఁ దెల్పు మన
బ్రాహ్మణుఁ డిట్లను సాధుచంద్ర! నా

కీ వభయం బొసంగుట మ
దిష్టముఁ జెల్పెదఁ జిత్తగింపు మో
హావిలమానసుండ నయి
యంగన నొక్కతె నాత్మఁగోరితిన్.

ఉ. ఆ లలనాలలామ భవదాజ్ఞ మెలంగుననుగాన నాపయిన్
జాలి వహించి కోర్కి కొనసాఁగుపిథంబున నామెఁబల్కినా
పాలిటి భాగ్యదైవముయి ప్రాణమునిల్పుమటన్న దాసుమం
జాలఁగ విస్మితాత్ముఁడయి సాంత్వనవాక్యల వాని కిట్లనున్

గీ. ప్రొద్దు పడమర తిరిగెను ముసలితనము
పైకొనియె నిట్టితటి నీవు బ్రాహ్మణుండ!
స్త్రీయఁ గోరుటయే యవివేక మనఁగఁ
బరవనిత కంగ లార్చుట భవ్య మగునె.

గీ. సర్వసంగములం బాసి సద్గురూక్త
సరణిఁ జరియించి సంతతసాధుగోష్ఠిఁ
బ్రొద్దుఁబుచ్చుచునే పెరసుద్దిఁ దలఁప
నేనుజెప్పిన నొప్పిదు నెలఁత యెవతె

ఉ. నావుడు విప్రుఁ డిట్లను న
నంగుఁడు దుర్జయుఁ డేమి చెప్పుదున్?
యౌవన మంకురించు సమ
యంబున నెట్టులో యౌవనాంత మం

దావిధిఁ గాను మెచ్చుఁ బురు
షాలికిఁ జిచ్ఛక్తికంట నామహా
దేవుఁడు కాల్పనే మతఁ డ
దృశ్యపిశాచమురీతి నొంచెదుర్.

గీ. పనస మున్నగు ఫలముల వాంఛ యట్లు
ఋతువు మొదటను జివరను గుతుక మెచ్చు
వచ్చె నను నుబ్బు తొలుతను బాసిపోవు
నను భయం బవ్వలను రాగ మాత్మఁ బెంచు.

క. ఈ సత్రధర్మకర్త్రి మ
హాసాధ్వి మమత నిను మది నారాధించున్,
గాసంత నీవు పల్కిన
నే సంకోచంబు లేక యొనయు నన్నున్.

మ. పరమార్థైకపరాయణుండ వయి
"సర్వం ఖల్విదం బ్రహ్మ" యన్,
స్థిరబుద్ధిన్ భువిఁ గల్గు ద్వంద్వ
చయమున్ దేహాభిమానంబు, స్వే
తరభేదంబును మించి సంత
తము నద్వైతానుసంధానత
త్పరతన్ దృశ్యము నెల్ల మాపుదు
మునీంద్రా! నీ కిదే పాటి దా.

గీ. అనఁగ దాసుఁడు పల్కె నో యనఘచరిత
సత్రమున భక్తి నాకు వసతి నొసంగి
భిక్ష నొసఁగఁగ నిట్లు దుర్వృత్తి కామెఁ
బ్రోత్సహించుట తగవె విప్రుండ! యనిన.

గీ. సత్ర మెవరిది ? నీకు భిక్షం బొసంగు
మమత యెవ్వతె? యామెపై మమత యిప్డు
పాసిపోయిన నీ కామె భార్య గాదె ?
నీదు నాజ్ఞను జవదాటు నెలఁత యెట్లు ?

క. తమ కనవసరమె యైనన్
'న మమ' యటంచు నొరులకు మనంబున నుంతే
భ్రమ లేక యొసఁగ రెది సం
యము లైనను దుర్జయం బహో మమత యిలన్.

గీ. ఇత్తు నా వశమైనది యేదియైన
ననుచు నీ వంట శంకింప కాత్మఁ గలఁచు
కోర్కెఁ జెల్పితి నింక నీ తర్క మేల ?
పొమ్మనినఁ బోకయుందునె మునివరేణ్య.

గీ. భూసురుం డిట్లు పలుకఁగ దాసుఁ డనిమె
రిత్తపోనేల నీదుకోరిక ఫలించు
సరణిఁ బల్కెదు, రమ్మ సంశయము విడచి
యనుచు నాతనితో నేగె నతివకడకు.

చం. తనదెస వచ్చు నాథుఁ గని
తామరసాయతనేత్ర యద్భుతం
బును ముదముఁ మదిం బొదలఁ
బున్నెము పండెను నేఁటి కంచు ది
గ్గన శయనీయముఁ విడచి
కంపితకోమలగాత్రవల్లి యై
వినతి యొనర్చ నా సతికి
విప్రునిఁ జూపి యమీంద్రు డి ట్లనుఁ.

క. ప్రారబ్ధవశాత్ముం డై
వారిజముఖి! విప్రుఁ డితఁడు భావమున నినుఁ
గోరి మనంబును మరలుప
నేరక కందర్పబాణనిహతుం డగుచుఁ.

గీ. నన్నుఁ గనవచ్చి తన కోర్కి విన్నవించె
నితనిఁ దనియింపు మది నాకు నిష్ట మనినఁ
గులసతీమణి యట్టె తాఁ గొయ్యబారి,
యొండు పలుకఁగ నేరక యుండి యుండి.

చ. త్రికరణశుద్ధిగా నిను వరించి భజించి తరించుపొంటె తా,
వక పదపద్మయుగ్మమె ప్లవం బని నమ్మిన నన్ను నిట్టి ప
తక మొడిఁగట్టు మంట యిది ధర్మమె? నీవు విధించి తేని జం
కక యెదియైనఁ జేయుదునుగాని మనోహర! యిద్ది నేర్తునే

క. ఆనతి యిచ్చితివే నను
మానింపక ప్రాణ మిత్త్రు మత్ప్రాణవిభూ
మానం బెట్టులు వీడుదు
మానవతులలోపల నవమానం బొలయున్.

క. అరవిందం బరయఁ బ్రభా
కర కరలాలన ముదంబుఁ గాంచును దోషా
కరుఁ గాంచ నేర్చునే భూ
సురు నీతని నెట్లు నేను చూడఁగ నేర్తున్.

ఉ. ఇాతకుమున్నె విప్రుఁ డితఁ
డెంతో వినమ్రత నన్నుఁగాంచి వే
దాంతము లెన్నొపల్కు పతి
యందలి భక్తియె యంతరాయ మ
త్యంతము మోక్షలబ్ధికి న
టంచని బుద్ధులు సెప్పె నిప్పుడీ
పంతముఁ జూడఁగా నితఁడు
వంచకుఁ డంచని తెల్ల మయ్యెడున్.

గీ. అనఁగ విప్రుడు పల్కె నో యబ్జవదన
మంచివాఁడనొ కాక నే వంచకుఁడనొ
చూత మవ్వల నిప్పు డాసుద్ది యేల?
తనకు వశమైన దిత్తు నంచనె నితండు.

ఉ. ఇష్ట మనిష్ట మంచనక
హేయము గ్రాహ్యము నంచుఁ బల్కక
తిక్లృప్తనిక్లృప్త భేదముల
నెన్నక, కష్టసుఖంబు లెంచక
క్లిష్టమనంబునన్ ధవున
కృత్రిమ భక్తి భజించు టొండె నా
కిష్టియు, యోగ మంచు వచి
యించితి వీవు సరోజలోచనా.

గీ. కాంతువశవర్తినివి నీవు గావయేని
ధవుని యానతిమీరుటే ధర్మమేని
తెలియఁబల్కుము కొంక కిందీవరాక్షి
మారు మాటాడ కిప్పుడే మఱలిపోదు.

గీ. ప్రాణముల నిత్తునని యిప్డు పల్కితిగద
ప్రాణముల కీశ్వరుండైనవాఁడు నీదు
మానమున కెట్లు కాకుండు మానవతిరో
సతులు భర్త్రాజ్ఞమీరరే సంకటమున.

గీ. ఏఁ బతివ్రత నను నహంకృతియె కాని
యుత్తమసతీత్వధర్మమో యుత్పలాక్షి
కలదె నీయెడ నే నింత పలుక నేల
తులసియే ధర్మసూక్ష్మంబుఁ దెలుపుఁగాక.

చ. అనవిని దాసుఁ డిట్లను
'యథార్థమ పల్కెను భూసురుండు నా
థుని పనుపెట్టిదైనను సతుల్
మదిఁ గొంకును జంకులేక శాం
తిని నెరవేర్తు రిచ్ఛయును
ద్వేషములేకయె ద్వంద్వజాల మీ
యనువున మించికాంత్రు మగ
నాండ్రు మహోన్నత సత్వసంపదల్.

ఆ. నాథుఁ డిట్టు లనగ నారీలలామంబు
వానిపాదములను వ్రాలిపలికె
స్వేచ్ఛ లేకనీవు చెప్పినయట్టులు
చేయుదాన నీదుసేవ యనుచు.

క. నానృడు దాసుఁ డిట్లను మ
నమ్మన నిక గవయంగఁగోరి యెం
తే విరహాకులుం డయిన
యీ ధరణీసురు కోర్కెఁదీర్చి సం
భావన సేయు మీశుఁడను
భావమునక మది నేవగింపకో
భావిని! పోయివత్తు నన
బ్రాహ్మణుఁ డాతని నాగి యిట్లనుక.

ఆ. అతిథి కుచితరీతి నర్ఘ్యంబుఁ బాద్యంబు
నొసఁగి కోర్కెఁ దీర్చు టొప్పుఁగాని
తనకనిష్టమై నదాని భిక్షుకునిపై
గసరి విసరునట్లు కాంత నిత్తె.

చ. లలన సమస్తభూషణక
లాపవిభూషిత యాచుఁ బేర్మి నీ
కెలన వసింప నిర్వురు నకృత్రిమభ
క్తి మదంఘ్రియుగ్మమున్
గొలిచి సమాహితాత్ము లయి
కొంకక నా దగు నాజ్ఞచొప్పునన్
మెలఁగుఁడు దాన మీ కగు న
మేయ శుభంబు లిటం బరంబునన్.

ఆ. అనిన దాసుఁ డట్లె యాగాక యని పల్కెఁ,
దదనుమతిని మమత తత్క్షణంబె
కదలిలోని కేఁగి కైసేసి కొనివచ్చి
వినయ మొప్ప నిలువఁ గని యతండు.

గీ. అర్ఘ్యపాద్యము లిచ్చి ధరామరేంద్రు
పాదపూజన మొనరించి పడఁతితోడ
భక్తి సాష్టాంగ మెఱఁగ నా బ్రాహ్మణుండు
అద్భుతముగఁ దిరోహితుఁ డయ్యె నంత.

సీ. పదపరాగమున నుపలమును బడఁతిగాఁ
జేయఁగల్గిన మహాసిద్ధవరుఁడు,
నవతమ్ము ప్రీతికై సామ్రాజ్యమును వీడి
యడవి కేగిన నిస్పృహాత్మకుండు,
శరణాగతత్రాణపరత విభీషణు
పాలించినట్టి కృపాపయోధి,
బ్రహ్మాస్త్రబలమునఁ బంక్తికంధరు నేపు
మాపఁగాఁ జాలిన మంత్రవిదుఁడు,

గీ. శంకరధ్యేయుఁ డఘవినాశంకరుండు,
తమ్ముఁడును సీత మారుతాత్మజుఁడు గొలువ
తులసి మమతయు నానందజలధి మునుఁగఁ
దారకబ్రహ్మ మచటఁ బ్రత్యక్ష మయ్యె.

గీ. ప్రణతినై వంచినట్టి శిరమ్ము లట్టె
యెత్తి యా దివ్యదర్శన మింతి తాను
హర్షబాష్పాంబుధారాప్రవర్ష మెసఁగఁ
గాంచి యీ రీతిఁ దులసి స్తుతించె నంత.

ఉ. తత్త్వచయంబు మించు పరతత్త్వమవై జననాద్యపేతపూ
ర్ణత్వముమై యజాండవిసరంబుల నిండిన నిన్ భజించి పు
త్రత్వమునం దదీయ జఠరమ్మునఁ దాల్చిన కోసలాత్మజా
సత్వమహాత్వ మెన్నఁగ వశంబె! మహీతనయామనోహరా.

చ. సవనము రక్షసేసెడు మిషంబున గాధి
సుతుండు పిల్వ నీ
వవరజుతోడఁ బోవుట యహ
ల్యను గాచి త్వదీయపాదరే
ణువు మహిత ప్రభావము వి
నూతనభక్తి నిదర్శనంబుగా
భువిఁ గనుపింపఁ జేయుటకె పో వ
సుధాతనయా మనోహరా!

ఉ. విశ్వమునందు లేఁడు ప్రతివీరుఁడు నా కని విఱ్ఱవీఁగు మా
హేశ్వరముఖ్యుఁడైన యసురేశ్వరుగుండెలు వ్రస్సిపోవఁ బృ
ద్వీశ్వరు లీసుఁజెందఁగ మహేశ్వరచాపముఁ ద్రుంచినావు స
ప్తాశ్వకులప్రదీపవసుధాత్మజ చిత్తములోఁ జెలంగఁగన్.

మ. తులసీదామముఁ గౌస్తుభం బెటు ల
టుల్ దోరంబుగా నీ యుర
స్థలి సౌభాగ్యవతీలలామ మయి ని
త్య శ్రీ విరాజిల్లు నీ
కులకాంతామణిరామ! ని న్నె
ఱుఁగదే కోదండమున్ వంచు కో
ట్లల శల్యంబుగఁ బన్నె లోక
మెఱుఁగన్ దైత్యారి వంచున్ నినున్.

మ. వనవాసశ్రమ మియ్యకొంటి
భృగుశాపంబట్లు దైత్యావృతా
వని భారంబుఁ దొలంప నద్ది
పరమోపాయం బట్టం జెంచి కై
క నినుం గానకుఁ బంప వేడునొకో నీ
కార్యంబు సాధింప దు
ర్జనులన్ సాధుల సృష్టి సేసెదు
రమారామా భవన్మాయచేన్.

గీ. రేఫవాంఛలు మదిలోన రేఁగనీక
భరతుఁ డురుభక్తి నినుఁ గొల్చువాఁడు గాదె
పాదుక నొసంగు కంటెను భక్తునెడలఁ
గలదె ఘనతర మా ననుగ్రహము రామ.

ఉ. ణిచ్చుల శబ్దశాస్త్రవిధి నిర్ణయరీతిని బ్రేరణార్థమై
వచ్చిన రూప మేసగిది వర్తిలు స్వార్థమునందు నట్టులే
చొచ్చిమనంబులోపలఁ బ్రచోదనఁ జేయఁగఁ జేయుఁ గర్మముల్
నిచ్చ ద్విధా ప్రవర్తిలుదు నీ వొకరుండవె జానకీపతీ.

క. యంత్రితచిత్తులు హరిపర
తంత్రులు మునిజనులు భక్తి దళుకొత్తఁగ నా
మంత్రణము సేయ దానవ
సంత్రాసముఁ బాపి వారి సాఁకితి రామా.

మ. భగవంతుడవు సర్వభూతగతులున్
భాసింపవే నీకు నా
మృగమం దెట్టులు భ్రాంతి గల్గు ?
జన మిట్లే నామరూపంబులం
దగులన్ దుఃఖముఁ దెచ్చుకొందు
రను బోధం బీయ మారీచుఁ డిం
దెగటార్పం దలపోసి కాక మృగముం
దేఁ బోవుదే రాఘవా.

ఉ. రోహిత కృత్రిమా ర్తరవరూషితభాషిణి వైై సురారి దు.
ర్వ్యాహృతి మెఱుంగకే మఱిదిబోధమునొల్లక తిట్టిపంప దే
వాహితుఁ డేచివచ్చి వసుధాత్మజ నెత్తుకపోయెఁగాని తా
నూహయొనర్పఁ డంతపయినొందు విపత్తును లక్ష్మణాగ్రజా.

శా. దేవానాంప్రియ శేఖరుం డయిన యా
దేవారి దైవారు మో
హావేశంబున మిన్నుముట్టి యస
హాయస్త్రీ శోకసంవిగ్న నీ
దేవేరిం గొనిపో, జటాయు వె
దుర్లై తీంట్రించి పోరాడె నో
దేవేశా ! ద్విజసంతతుల్ సతముఁ
ద్వత్సేవాపరంబుల్ గదా.

క. వనచరనాథుఁడు నీ డా
ఘనమైత్రినిఁ గోరి చేరఁ గాపాడితి వా
తని యన్న నొక్కకోలన్
దునిమితి కోదండరామ! దురితవిరామా.

చ. స్వదమున వానరోత్తములు జానకియున్కి నెఱుంగ నద్దెసల్
వెదకుచుఁ బోయి జాడఁ గనలేకయె క్రమ్మరి వచ్చిరంట య
ర్బుదముల నెన్న వచ్చును ముముక్షుజనంబులసంఖ్య దానిలో
నొదవును దత్త్వదర్శనసమున్నతి యే యొక పుణ్యరాశికో.

శా. ధీమంతుండు సమస్తవేదవిదుఁడ
ధ్యేయాఖిలవ్యాకృతి
స్తోమజ్ఞానధురంధరుండు బలవం
తుం డయ్యు నాత్మీయ మా
సామర్థ్యం బెఱుఁగండు ఋక్షపతి యా
శాసించునందాఁక మో
స్వామీ! మారుతి స్వస్వరూప మల యా
చార్యుండె తెల్పుం గదా.

చ. మనమును జిక్కఁబట్టి యల మారుతి ధీరత వార్ధి దాఁటఁ బె
ల్చనఁ జలియించి లేచె నచలంబె జడాశయచోదనంబునం
దన శిఖరోత్థకాననపదంబుల వాని శ్రమంబు దీర్ప, నా
ఘనుల కెవండొ చేయునుపకారము కోరకయే భవత్కృపన్

చ. హిత మెఱిఁగించి సీత కసురేంద్రు
నకుం దగు బుద్ధిసెప్పి యా
హుతి యొనరించి తత్పురి
మహోన్నతిఁ గ్రమ్మరి, యబ్ధి దాఁటి స్వ
స్థత భవదీయ పాదజలజద్వయి
సన్నిధిఁ జేరవచ్చి చూ
చితి వసుధాత్మజాత నని క్షేమము
మారుతి తెల్పె నర్మిలిన్.

ఉ. ధిక్కృతవైరి మారుతి నతి ప్రమ
దంబునఁ గౌఁగిలించి నీ
వక్కునఁ జేర్చి నాకుఁ గల యంతయు
నిచ్చితి నంటి రామ! యీ
దృక్కరుణాతిరేకమున నే క
ద యిమ్మహిలోన సత్వముల్
గుక్కుటముల్ నిజాండములకుం
గలిగించు స్వకీయరూపమున్.

క. యోజనము లేక నీదు ని
యోజనమున ననిలజుఁడు పయోధిఁ దరింపం
గాఁ జాలె మర్కటము లే
యోజన్ లంఘించు సేతు వౌదవక యున్నన్.

శా. యోగభ్రష్టుఁడు రావణుండు నిజపూర్వోదంత మెన్నంగ లే
కాగామిప్రవినాశ మెంచియు వృథాహంకారముం జెంచి నీ
తోఁ గయ్యంబునకాయితంపడఁగ నాదుష్టాత్ముఁ జింబాయు స
ద్యోగుఁ గాఁచితి వానితమ్ముని నమేయోదారతన్ రాఘవా.

మ. నలినాక్షా! దశకంఠకంఠములు దు
న్మం దున్మ వెన్వెంటనే
మలినాశల్ మదిలోఁ బొరింబొరిని
ద్రుంపం గ్రమ్మరన్ దోఁచు న
ట్లల లబ్ధిం బొడసూపున ట్లో
లయ బ్రహ్మాస్త్రంబు సంధించి య
త్తొలువేల్పుం బరిమార్చినావుగద
సంతోషింపఁగా లోకముల్.

చ. ప్రవిమలశీల యా సతికి వహ్నిపరీక్ష యొనర్చి తంట వా
స్తవమె ? సురారిచే నపహృతం బయినట్టిది మాయసీత ని
క్కువముగ నగ్నికుండమునఁ గోమలి దాఁచి విరోధిఁ జంపి యా
నవమునఁ దెచ్చుకొంటి వవనీసుతఁ గ్రమ్మర జానకీపతీ.

ఉ. చోదితరీతి నాదల వసుంధర నేలుభరంబుఁ బూనియుం
బాదుకలందు లక్ష్య మిడి పావకుఁ జొత్తుఁ జతుర్దశాబ్దమ
ర్యాద నతిక్రమించిన నటంచుఁ బ్రతిజ్ఞ యొనర్చినట్టి నీ
గాదిలితమ్మునిన్ భరతుఁ గావఁగవచ్చితి పుష్పకంబునన్.

సీ. దశరథాత్మజ సవ్యదిశ నీదు నర్ధాంగి
వైదేహి సొంపునై వరలుచుండ
ముందటఁ బవమానసందనుం డురుభక్తి
కింకరుం డగుచుఁ గెంగేలు మొగువ
వెనుకభాగంబున వీరాగ్రగణ్యుండు
సౌమిత్రి నీకు బాసటగ నిలువ
నిరుపార్శ్వములయందు భరతశత్రుఘ్నులు
వింజామరలు పట్టి విసరుచుండ

గీ. నమరపతి వైభవమున సింహాసనంబు
రహి నధిష్ఠించి ప్రాజ్యసామ్రాజ్యపట్ట
భద్రుఁ డైనట్టి దృశ్యంబు పాయ కెపుడు
భావమున నిల్పి నన్నుఁ గాపాడు మయ్య.

ఉ. యాగము సేయువేళ భవదాత్మజు లిర్వురు నీ చరిత్ర మ
భ్యాగతమౌనిచంద్రులు ప్రహర్షముఁ జెందఁగ నీదు మ్రోలఁ దం
త్రీగమకంబుల న్మధురరీతుల గానము సేసిరంట, యా
హా! గృహమేధిధర్మ మది సార్థక మీవృశపుత్రు లబ్బినన్.

మ. మృదువాక్యపరిచయం
బునఁ బహుళగంభీరార్థముల్ దోఁచు నిం
పొదవంగా నిజశిష్యుఁ డి
వ్విధిని భక్త్యుద్రేక మేపారఁ బ

ద్మదళాక్షు న్నుతియింప వాయుసుతుఁ
డత్యంతప్రమోదంబునన్
మదిలోఁ బొంగుచు వాని
గాఢపరిరంభప్రక్రియం దేల్చుచున్

సీ. జానకీజానిపాదకంజాతములకు
నెఱఁగి దాసుని వారికి నెఱుక పరచి
శిష్యవాత్సల్య మేపార శ్రీమదంజ
నాసుతుం డిట్లు లనుచు మనవి యొనర్చె.

శా. ధ్యాతవ్యంబు లహర్నిశంబును
భవత్పాదాంబుజాతంబు ల
ధ్యేతవ్యంబు భవచ్చరిత్ర మనుచున్
ధీరాత్ముఁడై దృశ్యలో
కాతీతుం డయి నిస్పృహుం డయి య
విద్యం గెల్చె నాత్మజ్ఞుఁడై
సీతారామ! యనుగ్రహింపుము
భవత్సేవాపరున్ వీనినిన్.

. మమత యహంతయు లేక
ప్రమత్తయగుచుఁ బతిపాదవనజంబుల నీ
మమత భజించును దేవీ!
విమలాత్మను నీమెఁ గనుమ ప్రీతి యొసంగన్.

ద్మదళాక్షు న్నుతియింప వాయుసుతుఁ
డత్యంతప్రమోదంబునన్
మదిలోఁ బొంగుచు వాని
గాఢపరిరంభప్రక్రియం దేల్చుచున్

క. జానకీజానిపాదకంజాతములకు
నెఱఁగి దాసుని వారికి నెఱుక పరచి
శిష్యవాత్సల్య మేపార శ్రీమదంజ
నాసుతుం డిట్టు లనుచు మనవి యొనర్చె.

శా. ధ్యాతవ్యంబు లహర్నిశంబును
భవత్పాదాంబుజాతంబు ల
ధ్యేతవ్యంబు భవచ్చరిత్ర మనుచున్
ధీరాత్ముఁడై దృశ్యలో
కాతీతుం డయి నిస్పృహుం డయి య
విద్యం గెల్చె నాత్మజ్ఞుఁడై
సీతారామ! యనుగ్రహింపుము
భవత్సేవాపరున్ వీనినిన్.

. మమత యహంతయు లేక
ప్రమత్తయగుచుఁ బతిపాదవనజంబుల నీ
మమత భజించును దేవీ!
విమలాత్మను నీమెఁ గనుమ ప్రీతి యొసంగన్.

చ. ఇరువదినాల్గువేల రచియిం
చిన యర్థము నెల్లనేర్పుమై
యిరువది నాల్గుపద్యముల
హృద్యముగా రచియించితో మునీ
శ్వర! భవదీయచాతురియు భక్తియు
లోకమెఱుంగఁగా నవి
స్తరముగ నస్మదీయచరితంబును
ప్రాకృతభాషఁ గూర్చుమీ.

ఉ. అమరవాణిఁ బల్కితి త్వదాదిమకావ్యము తద్రసంబు నీ
పామరు లెట్లెఱుంగుదురు? పండిత పామర వేద్యహృద్యభా
షామధురప్రసాదగుణసంయుతమై విలసిల్లు రీతులన్
రామకథా విధానము నొనర్పుము భక్తులు మోదమందఁగన్

గీ. నీ నిరభిమానవృత్తి ననిలసుతుండు
మాకుఁ జూపింపఁగా నొక్క మాయఁ బన్ని
నీదు సతివ ర్తనం బతి నిర్మలంబు
పడఁతి యంతులకెల్ల మేల్బంతి సుమ్ము.

శా. చేతం బెప్పుడు నీపయి న్నిలుపు నీ సీమంతినీరత్నముం
బ్రీతిం గూడి గృహస్థధర్మమున నిష్టప్రుండవై యుండి నీ
చాతుర్యంబును భక్తిగౌరవము విశ్వశ్రేయముం గూర్పఁగా
సీతారామచరిత్రముం బలుకు మత్సేవాపరుల్ రంజిలన్.

ఉ. ఈ లలనాలలామ విషయేచ్ఛలఁ జొన్పక నేర్పుతోడఁ జూ
డాల నిజాధినాథున కడంకువ యొప్పఁగ జ్ఞాననేత్రము
న్మీలిత మానటుల్ దెలిపి నేరమిఁ బాపినయట్లు నీదు ను
ద్వేలవిమోహ మాగి భవదీయవిముక్తికి నొప్పె హేతువై.

క. ఈ యమ సహవాసము నీ
కే యెడరును గలుగఁజేయ కెల్లెడ శ్రేయో
దాయక మగు నన్నింటను
సాయపడు న్నీకు సాధ్వి సహధర్మిణియై.

చ. అన విని దాసుఁడిట్లనియె నంబుజనాభ! త్వదాజ్ఞచొప్పునన్
గొనకొని నీదు పుణ్యకథఁగూర్చెదఁ బ్రాకృతభాష నీవు నా
మనమున వాక్కునన్ నిలిచి మంజులరీతులఁ గావ్యమెల్ల నొ
య్యనఁ బలికింపు భక్తజనులందఱుఁ జిత్తములందు రంజిలన్.

మ. భవదీయం బగు సచ్చరిత్రమును గావ్యప్రక్రియం గూర్చువై
భవము న్నాకు ననుగ్రహించి తనుకంపాపూర్ణభావుండవై
భవమో మోక్షమొ నాక దేమిటికి నీపైభారమున్ మోపి సం
భవమాదాని భవత్ప్రసాదమని సంభావించెదన్ రాఘవా.

సీ. ఆచంద్రతారక మవని నీ తారక
మంత్రంబు జనులు జపింత్రు గాత
వర్ణాశ్రమాచార పరిపాటినై ధర్మ
దీక్ష భారతులు వర్తింత్రు గాత

వేదవేదాంగాది వివిధశాస్త్రాధీతి
బోధప్రచారముల్ పొసఁగు గాత
క్షితినాయకులు ప్రజాక్షేమంకరులె యెాచు
శిష్టాళి నెపుడు రక్షింత్రు గాత

గీ. ధనికులకుఁ గల్గు గావుత ధర్మబుద్ధి
కృషియు వాణిజ్య మెల్లప్డు డెసఁగు గాత
అరినృపాలుర వలని భయంబు బాసి
భారతావని శాంతిమై వరలు గాత.

క. భూషితభాషాయోషా
శేష స్తనదుగ్ధలబ్ధశేముషి ! తత్త్వా
న్వేషణపర ! సకలకళా
పోషక ! బుధమాన్య నాగభూషణగణ్యా.

ఇది శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠస్థాపనాచార్య
శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్ష లబ్ధ సారస్వతో
పాసనాసాదిత సరసకవితావిలాస శ్రీనివాస కవికృత
గురుభక్తినామక శ్రీ గోస్వామి తులసీదాస
చరితోత్తరఖండ మహాప్రబంధంబున
పంచమాశ్వాసము

ఓం మితి శివమ్.

